# సమర్థ సద్గురు

ఆధ్యాత్మిక మాసపత్రిక

శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమం - 522508, గుంటూరు జిల్లా
ఫోన్ : (0863) 2293280, 2293564, 2293206
web: www.mathaji-babuji.org samardhasadguru@rediffmail.com

సంపాదక వర్గము
గూడూరి వెంకటరత్నం
డి.జె. బాలకృష్ణ లాల్
డా॥ ఎన్.రామతారక పరబ్రహ్మశాస్త్రి
మిస్.పి. ఇందిరాదేవి
జి.ఎన్.ఆర్. మూర్తి
డా॥ వి.వి.ఆర్. ప్రసాదరావు
డా॥ యమ్.స్వర్ణముఖి

Volume 28 Issue 8
No.of Pages 40
APRIL 2009

| | | |
|---|---|---|
| 5సం॥లచందా | రు. | 250.00 |
| 2సం॥ల చందా | రు. | 120.00 |
| సంవత్సర చందా | రు. | 60.00 |
| విడిప్రతి వెల ..... .. | రు. | 5.00 |

బ్యాంక్ డ్రాఫ్ట్A/C.Y.S.C.K.P.M చారిటబుల్ ట్రస్ట్ పేరులో డ్రా చేయండి. M.O.,బ్యాంక్ డ్రాఫ్ట్స్ పంపవలసిన చిరునామా:
మేనేజరు
సమర్థసద్గురు మాగజైన్
శ్రీకాళీగార్డెన్స్-522508

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,

ఈ సంచికలో....

# భద్రవాక్యం

**నోకస్మాదార్ద్రమేధః స్పృశతి చ దహనః కింతు శుష్కం నిదాఘా**
**దార్ద్రచేతోఽను బంధేః కృత సుకృత మపి స్వోక్త కర్మ ప్రజార్థైః**
**తద్వత్ జ్ఞానాగ్ని రేతత్ స్పృశతి న సహసా కింతు వైరాగ్య శుష్కం**
**తస్మాత్ శుద్ధో విరాగః ప్రథమ మభిహస్తేన విజ్ఞాన సిద్ధిః ॥**

శ్రీశంకరభగవత్పాదాచార్యులవారు పండితులు కానివారిపై పరమానుగ్రహంతో అద్వైత సిద్ధాంతాన్ని సరళతరం చేసి ప్రసన్న గంభీరంగా రచించిన లఘు ప్రకరణ గ్రంథములలో శతశ్లోకీలో ఈ శ్లోకం వైరాగ్యం వలననే జ్ఞానసిద్ధి అని చెప్పే నలుబదవ శ్లోకం.

అగ్ని తడిసిన కట్టెలను నేరుగా దహించదు. ఎండలకు బాగా ఎండిన కట్టెలనే చక్కగా దహిస్తుంది. అలాగే జ్ఞానాగ్ని కూడ వైరాగ్యం అనే ఎండకు బాగా ఎండిన మనస్సును స్పృశిస్తుందిగాని, భార్యాపుత్రాదులకోసం, కీర్తి ప్రతిష్ఠల కోసం, సంపదలకోసం కర్మలను ఆచరిస్తూ ఆ కర్మల వాసనలనే జలంతో తడిసి ముద్దగా అయిన మనస్సును స్పృశించదు. అందువలన విజ్ఞాన సిద్ధికి ఇహాముత్ర ఫలభోగ విరాగము మొదటిమెట్టు అని ఈ శ్లోకం తాత్పర్యం.

సంసార అశ్వత్థ వృక్ష మూలాన్ని అసంగమనే శస్త్రంతో దృఢంగా ఛేదించినవారే పురుషోత్తమ పదమును పొందించే మార్గంలో ప్రస్థానం చేస్తారు అని చెప్తుంది భగవద్గీత.

శ్రీగురుదేవులు కూడా కాయ పచ్చిగా ఉన్నంతకాలం అది చెట్టును అంటిపెట్టుకొని ఉంటుంది. ఒకవేళ బలవంతంగా తెంపినా అది ఏడుస్తూ సొనకారుస్తుంది కాని పండదు, కానీ దానిని ఇంకా కొంతకాలం చెట్టుకు ఉంచితే, అది పెరిగి పెద్దది అయి, దానికి అకర్షణీయమైన రంగు, చక్కని రుచి, వాసన వచ్చి, అదే చెట్టు నుండి విడిపోతుంది; అలాగే సంసారంలో ఉన్నవారు కూడా ఆశ్రమోచిత కర్మలను చక్కగా ఆచరిస్తే, వారు కూడా వైరాగ్య సంపన్నులై సంసారం నుండి విడువబడి జ్ఞానాన్ని, దాని ఫలమైన మోక్షాన్ని అనుభవిస్తారు అని అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు అతి తేలిక పదాలలో బోధించారు. *

# అమ్మ ఆశీస్సులు

శ్రీసర్వధారి నామ సంవత్సరమునకు వీడ్కోలు, శ్రీవిరోధి నామ సంవత్సరమునకు స్వాగతము పలుకుతూ భక్తులందరికీ నూతన సంవత్సర శుభాభివందనములతో శుభాకాంక్షలు తెలియచేస్తూ ..........

మనకు మనలోనే మసలుతూ మన సాధనకు అడ్డువస్తున్న విరోధులు అయిన కామాది గుణములు, ఈర్ష్య, అసూయ, అసహనం, ఓర్వలేనితనం లాంటి దుర్గుణములను గుర్తించి, ధ్యానాగ్నిచేత దహించి శ్రీసమర్థ సద్గురు దేవులకు మనం నిజసంతతిగా ఆనందించాలని, బ్రహ్మామృత సామ్రాజ్యాన్ని అనుభవించాలి అని శ్రీసద్గురుదేవులను ప్రార్థిస్తూ................

మౌనధ్యాన సప్తాహమును చక్కగా అనుభవించి, శ్రీసీతారాముల కళ్యాణము శ్రీరామనవమి రానే వచ్చింది. జీవబ్రహ్మైక్య అనుసంధానమును ఈ జీవితములోనే అనుభవించవలెను. శాశ్వత ఆనందమును పొందవలెను.

ఇటువంటి అద్వైత మార్గమును సూచించిన శ్రీసద్గురుపరంపర లోనివారు శ్రీఆదిశంకరాచార్యులవారు. **'నారాయణ సమారంభాం శంకరాచార్య మధ్యమాం అస్మదాచార్య పర్యంతం వందే గురుపరం పరాం'**. శ్రీఆదిశంకరుల జయంతి ఉత్సవమును, శ్రీగురు సంప్రదాయములోని వారందరము శ్రీవారి అవతార లీలలను చర్చించుకుంటూ, అదే రోజున శ్రీగురుదేవుల బృందావన ప్రతిష్ఠ చతుర్దశ వార్షిక మహోత్సవమును జరుపుకుందాము.

మనందరి మనస్సులో మెదిలే శ్రీవారు ఒక మూర్తిగా అనుగ్రహించిన రోజు కనుక సత్సంగంలో శ్రీసద్గురుదేవుల పూజలో అందరిలో ఉన్న శ్రీగురు దేవులకు మహానివేదన కార్యక్రమములతో ఆరోజు సమయమును సంపూర్ణంగా సద్వినియోగ పరచు కొందుముగాక! అట్టి శక్తిని, భక్తిని, అఖండ సాధనా సంపత్తిని శ్రీగురుదేవులు మనకు ప్రసాదించుగాక!

- మీ అమ్మ

# సంపాదకీయం

శ్రీసర్వధారి నామ సంవత్సరే అని సంకల్పంలో చెప్పుకుంటూ వచ్చిన స్థానంలో శ్రీ విరోధినామ సంవత్సరే అని చెప్పుకోవటం మొదలైంది. ఈ సంచిక మీ చేతిలోకి చేరేసరికి శ్రీకాళీవనాశ్రమంలో శ్రీరామనవమి వేడుకలతోపాటు శ్రీసీతాలక్ష్మణ హనుమత్ సమేత శ్రీకోదండరామస్వామివారి దివ్య లీలాకళ్యాణ సామూహిక మహోత్సవాలు అత్యంత భక్తిభరితంగా జరుగుతాయి.

అయస్కాంతం ముల్లు ఎప్పుడూ ఉత్తర దిశనే శూచించినట్లు గాలికి దూరంగా విసిరివేయబడినా ఉరుము ఉరుమగానే ఏ చెట్టు ఊడుగు గింజలు ఆ చెట్టుకే వచ్చి అతుక్కున్నట్లు, నది తన వల్లభుడైన సాగరునితో కలిసి తను అనేది ఏమీ మిగలకుండా పోయేదాకా శాంతించనట్లు, జనకుడు శివుని విల్లు ఎక్కుపెట్టిన వీరునికే సీతనిచ్చి వివాహం చేస్తానని శపథం చేసినా శివధనుర్భంగం కాకపోయినా, ప్రథమ దర్శనంలోనే సీతామహాసాధ్వి మనస్సు రామచంద్రునిపై లగ్నం అయింది.

ప్రకృతి ఏకైక పురుషుడైన ఆ పురుషోత్తముణ్ణి తప్ప అన్యుని వరించదు. మరి మనం మాత్రం ఏం తక్కువ? అమ్మ చెప్పినట్లు స్త్రీలే కాదు ఎవరి మనస్సు ప్రకృతికి వశమై ఉన్నదో వారందరూ గడ్డాలూ మీసాలూ ఉన్నాసరే స్త్రీలే! మనమందరమూ ప్రకృతి చిహ్నాలమే. సీతగా అయ్యే అవకాశమూ, శ్రీరామచంద్రుని వరించే అవకాశమూ మనందరికీ ఉన్నది.

మనందరమూ ఒక్కక్కరమూ ఒక్కొక్కసీతగా అయి, నీరసములు, కేవల రస భ్రాంతి జన్యములు అయిన ఈ లౌకిక రసాల నుండి బయటపడి ఒకేమాటవాడు, ఒకే బాణమువాడు సత్యపరాక్రమమువాడు అయిన ఆ రఘువీరునితో ఏకస్వరూపం కావటమే ఈ సామూహిక కళ్యాణాల అంతరార్థము, ప్రయోజనము.

మరపు వలననే మనకు జన్మలు కలుగుతున్నాయని శాస్త్రాలు చెబుతున్నాయి. మనం ఎక్కడ మరచిపోతామో అని 'వీడిది ఇక్ష్వాకువంశం, వీడిది ఒకటే మాట, వీడెప్పుడూ అబద్ధం చెప్పడు' అని అమోఘ వచస్కులైన శ్రీగురుదేవులు ఎప్పుడూ గుర్తుచేసేవారు. గురుసాంప్రదాయంలోని వారందరికీ ఈ సామూహిక కళ్యాణాలు నేర్పేపాఠం ఆత్మసమర్పణ చేసి, నేనును పూర్తిగా రహితం చేసికొని పురుషోత్తముని స్వరూపమైన గురుస్వరూపంతో ఏకరస స్వరూపంగా అయిపోవటమే. అట్టి శక్తిని భక్తిని, శ్రద్ధాసక్తులను ఆ రఘువీరుని స్వరూపమైన శ్రీగురుదేవులు అందరికీ ప్రసాదించెదరు గాక!

- గౌరవ సంపాదకుడు

## బాబూజీ ఉవాచ

(గత సంచిక తరువాయి) - స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

శ్రీకృష్ణ చరణామృతంతో తడిసిన ఆ ఇసుకరేణువులు రాధ శరీరంలో, మనస్సులో ప్రవేశించి ఆమెలోని సర్వగుణాలను, కర్మబీజాలను రహితం చేసేశాయి. పరమాత్మ శక్తి అంత గొప్పది. ఆ మధుర నామ మాహాత్మ్యం అంత అనుభవైకవేద్యమైనది.



బృందావన సమీపంలో ఆ ముగ్ధ మనోహర మూర్తి, ఆ బాలపరమాత్ముడు నడయాడుతూంటే ఆ దివ్య మంగళమూర్తిని చూసిన, పురుషులు, స్త్రీలు, బాలురు, వృద్ధులే గాక పశుపక్ష్యాదులు, మయూరాలు అన్నీ ఆయన్ని మోహించినవి. ఆ మయూరాలు మైమరచి నాట్యం చేస్తూంటే, ఆ నాట్యంలో లయ కలుపుతూ వాటికెదురుగా సర్పములు పడగలెత్తి ఆడేవి. ముంగిసలు ఆ సర్పముల చుట్టూ గిరగిరా తిరిగేవి.

అరణ్యంలోని మృగాలన్నీ ఆ దివ్యనాధుని మధురగానంలో మైమరచి, ఆ జీవనాధుని చుట్టూ వలయాకారంగా తిరుగుతూ, ఆనందంతో నృత్యం చేసేవి. వృక్షాలు చల్లనిగాలిని ఆయనకు తాకిస్తూ, ఆ గాలికి ఆ లోక మనోహరుని ముంగురులు నుదుటిపైన, ముత్యాలసరులు ఆయన హృదయసీమపైన, కర్ణాభరణములు ఆయన చెక్కిళ్ళపైన, బంగారు మొలత్రాడుకు కట్టిన గజ్జెలు ఆయన కటిసీమపైన, కాళ్ళ గజ్జెలు ఆ చిరుపాదాల పైన చేస్తున్న లయవిన్యాసానికి అనుగుణంగా తాము కూడా తమ కొమ్మలను అటు ఇటు ఊపుతూ లయ కలిపేవి. లతలు పులకించి పూలవానలు కురిపించేవి. అది ఇది అననేల? భూమి, ఆకాశములతో కూడిన పంచభూతములు పరవశించిపోయేవి. కాలగమనమే స్తంభించిపోయేది.

అట్టి సర్వజీవనాధుడైన శ్రీకృష్ణపరమాత్మ నందయశోదల గృహంలో ఉద్భవించటం ఆ వ్రేపల్లె వాసుల మహాభాగ్యము. ఆయన కాలుపెట్టినది మొదలు, వ్రేపల్లెలోనే గాక ఆ పరిసర ప్రాంతమంతా పాడి, పంటలతో సకలైశ్వర్యములతో దినదిన ప్రవర్ధమానంగా శోభిల్లినది. అంతులేని ఆనందము,

శాంతి ఆ వ్రజభూమిలో విరాజిల్లినది. ఆ చిన్నారి బాలుని మధుర మందహాసాలు ముల్లోకాలను మైమరపించేవి. ఆ దివ్య నేత్రములు వికసించిన కమలములవలె విశాలమైన సకల జీవకోటిపైన చల్లని చూపుతో ఆనంద చంద్రికలను వెదజల్లేవి. ఆ చల్లని కిరణం ఎవరి హృదయకంజాతంలో ప్రవేశిస్తుందో, అందలి అజ్ఞాన తిమిరములు హరించి, ఆత్మానందపు వెలుగుతో నిండిపోయేవి. సంపెంగ పువ్వు కంటె చక్కదైన ఆ నల్లనయ్య నాసిక సర్వజీవుల జన్మజన్మాంతరాల వాసనలను హరించగలదు. ఆ పరమహంస స్వరూపుని ఆశ్రయిస్తే, హంస తన ముక్కుతో నీటిని, పాలను విడదీసినట్లు ఆయన ఆ జీవిలోని పూర్వ వాసనలన్నిటినీ పీల్చి హరించివేసి, ఆత్మజ్ఞాన క్షీరాలను అందింపజేసి తరింపజేసే వాడు.

నంద యశోదల ఇంట్లో ఆ పరంజ్యోతి, ఆ అఖండజ్యోతి నిత్యమూ జ్ఞానకాంతులను వెదజల్లుతూ విరాజిల్లుతూ ఉండేది. సాయంత్రం పూట ప్రతి ఇంటివారు ఆ ఇంటికి వచ్చి, ఆ అఖండం వద్ద దీపం వెలిగించుకుని తమ ఇళ్ళకు వెళ్ళేవారు. అక్కడ మన స్వామి ఉండేవాడు. అందెలు, చిరుగజ్జెలు, సూరే గుమ్మడికాయ వంటి బుల్లిబొజ్జతో ఆ నల్లనయ్య చిరునవ్వులు చిందిస్తూ ఆ అఖండ జ్యోతిని నేనే అన్నట్లు వాళ్ళకు కనిపించేవాడు.

ఆ గోపకాంతలు ఇటు దీపం వెలిగించుకుంటూ, అటు ఆయనను చూస్తూ ఆ వెలిగించుకునే వత్తితోపాటు తమ చెయ్యి కాలిపోతున్నా, వాళ్ళకు తెలియకుండా తన్మయత్వం పొంది అలా ఆయన వంక గుడ్లప్పగించి చూస్తూ, నోళ్ళు తెరచి, నోటమాట రాక నిలబడిపోయేవారు.

ఇనుమును ఆకర్షించి, ఆ ఇనుముకు కూడా ఆకర్షణ శక్తిని ప్రసాదించే గుణం అయస్కాంతానికి ప్రసాదించిన భువన మోహనమూర్తి, ఇనుము కంటె కఠినమైన మానవ హృదయాలను ఆకర్షించి, ఆ హృదయాలను పవిత్రంగా మార్చగలగటంలో ఆశ్చర్యమేమున్నది? ఇక తమ పత్నులు దీపాలు వెలిగించుకుని వస్తామని వెళ్ళి, ఎంతసేపటికీ రాకపోయేసరికి వారి మగవారు వాళ్ళను వెతుక్కుంటూ అక్కడకి వచ్చేవారు. తమ ఆడవాళ్ళపై కోపం వచ్చేటంత లోపలనే ఆ కృష్ణజ్యోతి వాళ్ళకు దర్శనమిచ్చేది. ఇక వాళ్ళ అవస్థ కూడా తమ పత్నుల అవస్థలాగానే మారిపోయేది.

-సశేషం

# మాతాజీ అభిభాషణ

(గతసంచిక తరువాయి) -జపమాల ప్రసాద

రాచదృష్టికి రాళ్ళు కూడా బ్రద్దలవుతాయి అంటే రాజసగుణానికి అని అర్థం చేసుకోవాలి. అంతేగాని, యితరులని విమర్శించకూడదు. అంతటి గురుసేవలో ఉన్నవారికే ఇటువంటి నీచదృష్టి వస్తే మనబోటి వారెంత జాగ్రత్తగా ఉండాలి! రజో, తమోగుణాలని తగ్గించుకుంటూ, సత్త్వగుణాన్ని అభివృద్ధి చేసుకోవడం కోసమే గురుకుల వాసం చేస్తున్నాం. వీడు సన్నగా ఉన్నాడు, వాడు లావుగా ఉన్నాడు, వాడిలాంటివాడు, వీడు ఇలాంటివాడు, అనే విమర్శలే చేస్తూంటే మళ్ళీ మళ్ళీ జన్మలు వస్తూనే ఉంటాయి. కనుక సాధకుడైనవాడు, తాను సాధనలో ఎంతవరకూ వచ్చాను, తనలోని దోషాలేమిటి అని ఆత్మవిమర్శ చేసుకోవాలి. అంతేగాని, ఇతరుల లోపాల నెంచేవారు ఆశ్రమవాసం చేయనక్కరలేదు. మన వినాయకుడికి శరీరదృష్టి అనేది లేదు. చంద్రుడు నవ్వేసరికి గణపతి పొట్టపగిలి ఆయన స్వీకరించిన కుడుములు, ఉండ్రాళ్ళు, ఫలాలు - ఒకటేమిటి అన్నీ దొర్లుకుంటూ ఉన్నవి ఉన్నట్లుగా బయటికి వచ్చాయట! దీనిని బట్టే మనకి తెలుస్తున్నది కదా, ఆయన తిన్నాడో లేదో! మానవులు గాని, ఏజంతువైనా గానీ ఆహారాన్ని తింటే మళ్ళీదానిరూపం యథాతథంగా ఉంటుందా? సరే, మిగతా కథ మనకి తెలిసినదే. చంద్రుడికి అమ్మవారు శాపం ఇవ్వడం, గణపతికి బ్రహ్మదేవుడు మళ్ళీ ప్రాణప్రతిష్ఠ చేయడం జరిగిపోయాయి. జగన్మాత రజోగుణాన్ని, పరులనువిమర్శించే బుద్ధిని శిక్షించిందని గ్రహించాలి మనం.



బొజ్జగణపయ్య నిజంగా భోలాగణపతే. మన వంటింట్లో డబ్బాలోని పసుపుతో చేసినా, ఒండ్రుమట్టితో చేసి ఆకులో కూర్చోపెట్టి గరికగడ్డితో పూజచేసినా చాలు. ఆయన మనం కోరిన వరాలన్నీ తీర్చేస్తాడు. మనం ప్రారంభించే పనులన్నీ, నిర్విఘ్నంగా కొనసాగేటట్లు చేస్తాడు. కళ్ళుమూసుకుని మనసారా ప్రార్థిస్తే చాలు "ఏమి కావాలి చెప్పు, ఏమి కావాలి చెప్పు" అని బుల్లి బుల్లి అడుగులతో మనముందు నిలుచుంటాడు. మన తృప్తి కోసం మనం ఇన్నేసి పళ్లూ, ప్రసాదాలు పెడుతున్నాంగానీ, చిన్న బెల్లం ముక్కతోనే తృప్తిపడతాడాయన. దుర్వాయుగ్మం అంటే గరిక గడ్డితో పూజచేస్తే గణపతికి చాలా ఇష్టంట! ఏ గరిక గడ్డి అయితే మనం ఆవులకి మేతగా వేసి, దూడలని కూడా

త్రాగనీయకుండా పాలన్నీ మనమే పిండేసుకుంటున్నామో, అటువంటి ఎందుకూ పనికిరాదని తీసిపారవేసిన గరికగడ్డి ఆయనకి ఇష్టం ఎందుచేతనో?

**అంగుష్ఠ మాత్ర: పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః**
**తం స్వాచ్ఛరీరాత్ ప్రవృహేన్ముంజాది వేషీకాం ధైర్యేణ**
**తం విద్యాచ్ఛుక్రమమృతం। తం విద్యాచ్ఛుక్రమమృత మితి॥**

అని కఠోపనిషత్తు చెప్తున్నది. అంటే అంతరాత్మ అయిన పురుషుడు బొటన వ్రేలంతటివాడు సర్వదా ప్రాణుల హృదయాలలో నివశిస్తూ వుంటాడు. గడ్డినుండి లోపలనున్న పోచనులాగ శరీరం నుండి ఆతనిని వేరు చేయాలి. అలా చేసినవాడు పరిశుద్ధుడూ, అమరుడూ అని తెలుసుకోవాలి. అంటే మానవుడు నిరంతర విచారణ, ధ్యానం ద్వారా తనలోనున్న శుద్ధ చైతన్యాన్ని దేహభావన నుండి వేరుపరచుకోవాలి అని పై మంత్రానికి అర్థం. ఇది సూచించేందుకనే ఏమో గణేశుడు గడ్డితో పూజ చేయించుకుంటాడు! ఆయన పొట్టివాడు, మరుగుజ్జు అంటున్నాం. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారు రాబోయేకాలంలో అందరూ పొట్టిగానే అయిపోతారని చెప్పారు. అయితే మన గణపతి పొట్టివాడు అంటే అంగుష్ఠమాత్ర పురుషుడే సుమా!

ఒకసారి శ్రీ గురుదేవులు, మన కామేశ్వరక్క "వాతాపి గణపతిం భజేహం" అనే కీర్తన పాడాక, "గణపతిలో ఓంకారముంది. ఎక్కడో చెప్పండి?" అన్నారు. అందరం తెల్లముఖాలు వేశాం. అప్పుడు స్వామివారు, "ఇప్పుడే కదా పాడావు. ప్రణవస్వరూప వక్రతుండం అని! ఆయన వక్రతుండంలో ఓంకారముంది. శ్రీ గణపతి అందుకే ప్రణవస్వరూపుడు" అని అన్నారు.

శ్రీ గణపతి ఉపనిషత్తు, గణపతి తత్త్వాన్ని ఎంతో ధాటిగా వివరిస్తుంది. గణపతి మూలాధార చక్రంలో వుంటాడు. మన సాధన అంతా కూడా మూలాధార చక్రం దగ్గర నుండే మొదలవుతుంది. 'త్వమేవ ప్రత్యక్షం తత్త్వమసి। త్వం సాక్షాదాత్మాసి నిత్యమ్...త్వం ప్రత్యక్షం బ్రహ్మాసి...' అని చెప్పుతుంది గణపత్యుపనిషత్. నువ్వాశ్రయించిన దేవుడు నువ్వే అయివున్నాడు. నువ్వు తప్ప వేరే ఏమీలేదు. అణువణువులోనూ తత్త్వం నిండివుంది అని చెప్తుంది ఉపనిషత్తు. కనుక ఈ భావాన్ని పరిపూర్ణంగా హృదయం నిండా నింపుకుని గణపతిని సేవిస్తే, మూలాధారం నుండి ఊర్ధ్వముఖంగా గురుస్థానమైన సహస్రారాన్ని చేరుకుని ఆనందించేటట్టు చేస్తాడు. మనసాధనలో విఘ్నాలు లేకుండా సాఫీగా ప్రయాణం చేయిస్తాడు విఘ్నాధిపతి గణేశుడు. అట్టి గురుగణపతి అఖండ భక్తి జ్ఞాన, వైరాగ్యములను, అఖండ ఆయురారోగ్య, ఐశ్వర్య, సుఖ, శాంతులను, అఖండ సాధన సంపత్తిని ప్రసాదించి సర్వులనూ కాపాడుగాక! సాధనా మార్గములో సమస్త విఘ్నాలనూ తొలగించి, గురులక్ష్యార్థమును సాధించే శక్తిని ప్రసాదించుగాక!

# సన్నిధిలో సంభాషణ

(గతసంచిక తరువాయి) - పరాశర ప్రసాద్

మీ రచన మీరు నాలుగురోజుల్లో వ్రాయవచ్చు. భగవానుడు మిమ్మల్ని అనుగ్రహించి మీరు ఇంకా మంచి రచనలు చేయవచ్చు. దాని వలన ఏం లాభం? మీ రచనలతో లైబ్రరీ అంతా నిండిపోవచ్చు. కాని అవి ఎంతకాలం ఉంటాయి? క్రమేపీ కాలగర్భంలో కలిసిపోతాయి. కాని అనుభవంతో కూడిన రచన నాలుగు సంవత్సరాలు అయితే ఏమిటి? చిన్న పుస్తకమే కావచ్చు, అది కలకాలం నిలిచిపోతుంది. భగవానుడు సగుణంగా విచ్చేసినప్పుడు ఎంతమంది గ్రహించగలుగుతారు? నేను పరమాత్ముడనని చెప్పుకున్నా నమ్ముతారా? అయన మాత్రం భక్తుల కోసం తపన పడతాడు. ఆనాడు కృష్ణ పరమాత్మని ఎవరైనా నమ్మారా? పోనీ త్రేతాయుగంలో చూస్తే అప్పుడు మాత్రం లేరా? ఆనాడు కూడా నమ్మనివాళ్ళు లేకపోలేదు. అయితే వారిలో ఆధ్యాత్మిక శక్తి ఉంది. అది వారిని తరింపజేసింది. వారిలో ధ్యానం ద్వారా ఉద్భవించిన శక్తి కొలదిగా జ్ఞానశక్తిని కలుగజేసి అది వారిని భగవానుని దగ్గరకు చేసింది. కానీ ఆ ధ్యాన శక్తి ఈనాడు లేకపోలేదు. ధ్యానమే లోపించింది అంతే.

మీకు ఒక దృష్టాంతో చెప్తాను. మీలో చాలామంది నన్ను చూడటానికి వచ్చారు. చాలా సంతోషం. నన్ను చూడటం అయిపోయింది. కాబట్టి ఈరోజే అవకాశం దొరికితే మన వ్యవహారం బాబూజీతో చెప్పి సెలవు తీసుకుందాం అని మీలో మీరు సంభాషించుకుంటున్నారు. మరి దీన్ని ఏమంటారు? దీనినే అవసరార్థ భక్తి అంటారు. కానీ మహాత్ములు మాత్రం అలాకాదు. మీరు లేకపోయినా నేను మిమ్మల్ని వదులుకోలేను. మిమ్మల్ని ఏదో రకంగా పైకి తీసికొని రావాలని చూస్తాను. అశోక చక్రవర్తికి ఒక గురువు ఉండేవాడు. ఆయన ఎప్పుడూ ఒక బోధ చెప్పేవాడు. ధనధాన్యాదులు మానవుడికి ఎంతో సౌఖ్యాన్ని ఇస్తాయి. కాని... అని.....అసంపూర్ణంగా బోధను ఆపేసేవాడు. అశోక చక్రవర్తి గురువుగారిని ప్రశ్నిస్తూ 'స్వామీ! తమరు ఎన్ని సార్లు బోధ చేసినా కాని.... అని ఆపేస్తున్నారు. దాని అర్థం వివరిస్తారా?' అని అడిగాడు. సమయం వచ్చినప్పుడు తెలుస్తుంది లే అని గురుదేవుడు చెప్పాడు.

అశోకుడు ఎంత సామ్రాజ్యాన్ని, కీర్తిని ఆర్జించాడు? తుదకు యుద్ధ రంగంలో ఒకనాడు రక్తపాతాన్ని చూసి విరక్తి చెంది తన ఖడ్గాన్ని త్యజించి ఇక యుద్ధం చేయనని శపథం చేసి, శాంతి ధర్మాన్ని ప్రబోధించాడు. అశోకుడు గురుదేవుని ప్రబోధాన్ని అప్పుడు అర్థం చేసికొన్నాడు. అశోక చక్రం ధర్మానికి సంకేతం. ఈనాటికి అది ప్రకాశిస్తూనే ఉంది. ఎంతో మంది చక్రవర్తులు మన దేశాన్ని పరిపాలించారు. వారంతా కాలగర్భంలో కలిసిపోయారు. కానీ అశోకుని పేరు ఈనాటికీ చిరస్మరణీయంగా నిలిచిపోయింది.

అలాగే నేను బోధ చేస్తూ ఉంటే మీరంతా విని బాబుగారు చెప్పింది బాగానే ఉన్నది కాని మాకు అత్యంత అవసరమైన పని ఉంది ఏం చెయ్యం? అని ఏదోవిధంగా సమాధాన పరచుకుని వెళ్ళిపోతారు. మీఅందరినీ విమర్శించటం కాదు కాని, మీకందరికి ఒకరినొకరు విమర్శించుకోవటం, హేళన చేయటం బాగా అలవాటు అయిపోయింది. అమెరికా ప్రజలు అలా ఎన్నడూ చేయరు. వారికి ఆధ్యాత్మిక చింతన చేసే వ్యవధి ఉండదు. ఆలోచించరు. కాని దాన్ని గురించి వారికి తెలియజేస్తే మాత్రం దాన్ని వారు విడిచిపెట్టరు. అయ్యో! చాలా టైమ్ అయిందే! మిమ్మల్నందరినీ కష్టపెట్టాను. పాపం! మీ టైమ్ అంతా వేస్ట్ చేశానేమో!' అన్నారు.

ఇంకా మాట్లడుతూ 'నేను మీకు చెప్పింది జాగ్రత్తగా ఆచరిస్తే నా టైమ్ వేస్ట్ అనుకోను. అప్పుడు మీకు కూడా ఆ టైమ్ వృథా కాదు. మీరు సాధించగలిగినది సాధించగలుగుతారు' అన్నారు శ్రీబాబు. 'మానవుడు ఎంతో కష్టపడి ధనాన్ని సంపాదిస్తాడు. దాన్ని కొడుకు ఖర్చు చేస్తాడు. తండ్రి ఏమైనా అంటే తిరిగి కొడతాడు కూడా. దారాపుత్రాదుల ప్రేమ అలా ఉంటుంది. భగవానుడి ప్రేమ ఒక్కటే సుస్థిరమైనది. మానవుడు తన జీవిత కాలమంతా చదువుకే వినియోగిస్తే ఇంక సాధించేదేమిటి? ఎంత చదివినా ఏం లాభం? అది మానవుణ్ణి గమ్యానికి చేరుస్తుందా? ధనాన్ని ఆర్జిస్తాడు, పదవులు సంపాదిస్తాడు. ఎంతో పాండిత్యాన్ని సంపాదిస్తాడు. తరువాత వట్టి చేతులతో మట్టిపాలవుతాడు. పరుగెత్తి పాలు త్రాగటం కన్న నిలబడి నీళ్ళు త్రాగటం మంచిది కదా! ఒక వ్యక్తి తనకు ఉన్నదానితోనే తృప్తి చెంది ఎక్కువ ఆశకు పోడు. వేరొకడు ఎంతో తాపత్రయ పడి జీవితమంతా వృథా చేసికొంటాడు. వీరిద్దరిలో ఎవరు గొప్ప? మీరే నిర్ణయించండి' అన్నారు శ్రీబాబు.

- సశేషం

## శ్రీకాళీగార్డెన్స్‌లో విశేషపూజా కార్యక్రమములు

**ఏప్రియల్ 2009**

**3 శుక్ర శ్రీరామనవమి,** శ్రీ సద్గురు పాదపూజ, శ్రీ సీతారాముల సామూహిక కళ్యాణాలు, భక్త సమారాధన.

**9 గురు పూర్ణిమ,** శ్రీ సద్గురు పాదపూజ.

**19 ఆది శ్రీగురుదశమి,** సత్సంగం,శ్రీ సద్గురు పాదపూజ.

**23 గురు మాసశివరాత్రి.**

**29 బుధ శంకర జయంతి,** శ్రీ సద్గురు దివ్యమంగళమూర్తి చతుర్దశ వార్షిక ప్రతిష్ఠా మహోత్సవము, శ్రీసద్గురుపాదపూజ, సత్సంగ సమావేశము, భక్తసమారాధన.

**మే 2009**

**9 శని వైశాఖ పూర్ణిమ**, ఉదయం 5గం.3ని॥లకు శ్రీ సద్గురు పాదపూజ, సత్సంగం, భక్త సమారాధన.

**14 గురు** శ్రీ కాళికా పరమేశ్వరీ సహిత రామలింగేశ్వరస్వామి ప్రతిష్ఠాఅష్ట వింశతి వార్షిక మహోత్సవము, రాత్రి 7 గం.లకు మహాకాళికా పరమేశ్వరి రామలింగేశ్వరస్వామివారల లీలా కళ్యాణ మహోత్సవము.

**19మంగ శ్రీగురుదశమి**, హనుమజ్జయంతి, హనుమాన్ చాలీసా పారాయణ, సత్సంగం, శ్రీ సద్గురుదేవుల పాదపూజ.

**23 శని** మాస శివరాత్రి.

## శ్రద్ధాంజలి

శ్రీకాళీవనాశ్రమ నివాసులు, శ్రీసద్గురుదేవుల పరమభక్తులు అయిన శ్రీమతి నేలభట్ల సరోజనిగారు (ఆంజనేయశర్మగారి ధర్మపత్ని) తేది. 10-3-09 మంగళవారం (హోలీపూర్ణిమ)నాడు రాత్రి 7గం.ల 30ని॥లకు ఆశ్రమంలో శ్రీసద్గురు సాయుజ్యం పొందారు. వారి వయస్సు 67 సం॥లు. వారికి భర్త, ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె ఉన్నారు. సద్గురుదేవులు వారి కుటుంబ సభ్యులకు ఆత్మశాంతిని ప్రసాదించెదరు గాక!

# సత్సంగ సౌరభం

(గతసంచిక తరువాయి)

-రమణ ప్రసాద్

గుండుగొలను గ్రామంలో డిశంబరు 9 నుండి డిశంబరు 11 వరకు నిర్వహించిన శ్రీశ్రీశ్రీ సద్గురు గీతాయజ్ఞంలో జరిగిన సాధు సమ్మేళనంలో 9వతేదీన పరమహంస పరివ్రాజక, పూజ్యపాద శ్రీశ్రీశ్రీ దండినిర్మలానందగిరి స్వామివారి ప్రవచనం ఇక్కడ సంక్షిప్తంగా ప్రచురిస్తున్నాము - ఎడిటర్

ఈ గ్రామంలో అడుగుపెట్టి తమ పాదస్పర్శచేత దీనిని పునీతం చేసిన శ్రీ బాబూజీ మహరాజ్‌వారికి, ఆ అడుగుజాడలలోనడుస్తున్న మాతాజీకి, కేరళలోపుట్టి ఆంధ్రదేశంలో అడుగుపెట్టి ఆధ్యాత్మిక రోచిస్సులను నలుదిశలా వ్యాపింపజేసిన అస్మద్గురువరేణ్యులైన శ్రీ మలయాళస్వామివారికీ, మీ అందరిలో ప్రకాశిస్తున్న పరమాత్మకు నమస్కరిస్తూ, ప్రియాత్మబంధువులారా!

గీతాయజ్ఞం - ఇదికూడా యజ్ఞమే. ఇది జ్ఞానయజ్ఞం. ఆ యజ్ఞంలో ఋత్విక్కులు, సమిధలు, హవిస్సులు ఉంటాయి. ఆ యజ్ఞంలో శ్రవణమే ఉంటుంది. మహాత్ములు చేసే బోధలు మానవకోటిని తరింపచేస్తాయి. మేకమెడ క్రింద రెండు స్తనాలు ఉంటాయి. కాని అవి నిష్ప్రయోజనం. అలాగే జీవితంలో అన్నీ ఉన్నా జ్ఞానం లేకపోతే అవన్నీ నిష్ప్రయోజనం. మేడలు ఉండవచ్చు. డబ్బు ఉండవచ్చు. ఎన్ని ఉంటే ఏమి లాభం? జ్ఞానం ఉండాలి.

ఒక అమ్మాయికి పెళ్ళి చేయాలంటే ఎన్ని చూసుకోవాలి? ఒక అబ్బాయిని చూశారు. ఆ అబ్బాయికి అన్నీ బాగానే ఉన్నాయి. ఉద్యోగం ఉంది. పొలాలు ఉన్నాయి. సరే! హస్త సాముద్రికం చూశారు. ధనరేఖ జెర్రిపోతులాగా ఉంది. కాని పాపంఆయుస్సే తక్కువ. ఆ సంబంధం చేస్తారా? అన్నీ ఉన్నా ఆయుష్షు లేకపోతే అవన్నీ నిష్ప్రయోజనం. అలాగే జ్ఞానం లేని జన్మ నిష్ప్రయోజనం. జ్ఞానం పొందటానికి వేదాలు, ఉపనిషత్తులు అన్నీ అధ్యయనం చేయాలి అనుకుంటే దానికి నీ జీవితకాలం సరిపోదు. అంతకంటే గీతను ఆశ్రయించు. నీ పాడుగీతలన్నీ మంచిగీతలవుతాయి. భగవద్గీతను నీ జేబులో పెట్టుకో. నీ మనస్సులో పెట్టుకో.

**గీతా గంగోదకం పీత్వా...** ఎంతమందో త్రాగారు. భారతీయులే కాదు విదేశీయులుకూడా త్రాగారు. ఎంతమంది త్రాగినా ఇంకా మిగిలి ఉన్నది. అది చెవులతో త్రాగేది. అదే గీతామృతం.

ఒకామె కార్తీకమాసంలో నేతిబీరకాయ పచ్చడి తినాలనుకొంది, నేతి

బీరకాయలలో నెయ్యి ఉంటుంది అనుకొని. అలాగే ఇక్కడ గీతామృతంలో అమృతం అంటే అమృతవాక్కులు. అవి మహాత్ముల బోధద్వారా లభిస్తాయి. అది నిజమైన అమృతం. **గీతామృతేన తృప్తస్య...**

అమృతాన్ని త్రాగితే మనకొచ్చే లాభం ఏమిటి?

పునర్జన్మ న విద్యతే... పునర్జన్మ లేదు.

సురేశ్వరాచార్యులవారు చెపుతారు -

జన్మకు కారణం ఏమిటి? కర్మ.

కర్మకు కారణం? వాసనలు.

దానికి కారణం? రాగద్వేషాలు.

దానికి కారణం? ద్వైతబుద్ధి.

దానికి కారణం? అజ్ఞానం.

దానికి కారణం? అనిర్వచనీయం.

మనం విలువైన వస్తువులు భద్రంగా దాచుకుంటాం. రత్నాలు, మణులు, ఆభరణాలు మొదలైనవి. అలాగే స్వామివారినోటినుండివచ్చే వాక్కును - అదే గీతామృతం, దానిని హృదయంలో భద్రపరుచుకోవాలి.

**విష్ణుపాదోదకం గంగ...** పాపాలను పోగొడుతుంది.ఒకాయన తెనాలినుండి కాశీకి వెళ్ళాడు. తిరిగి వచ్చాడు. వాడిలో ఏమీ మార్పు రాలేదు. కాశీ వెళ్ళి గంగలో మునిగితే పాపాలు పోతాయి అంటుంది శాస్త్రం.మరి శాస్త్రం చెప్పింది అబద్ధమా? కాదు. ఆయన కాశీ వెళ్ళి నదిలో దిగేముందు బట్టలు గట్టుపై పెట్టాడు. నదిలో ఉన్నంతసేపూ పాపాలు చేరలేదు. నదినుండి బయటకు రాగానేమేము నీ పాతచుట్టాలమే అని వచ్చి చుట్టుకున్నాయి. గీతాగంగ చైతన్యవంతమైనది. అందులో ఒకసారి మునిగితే సంసారపంకం అంతా వదులుతుంది. కేవలం పాపాలు పోవటం కాదు. పాపబుద్ధి నశిస్తుంది..

ఒక ఊరిలో నూతిలో నీళ్ళు కంపు కొడుతున్నాయని మనుష్యులను పెట్టి నూతిలోని నీరంతా తోడించారు. అయినా కంపు పోలేదు. ఎందుకంటే అందులో ఒక కుక్క చచ్చి పడిఉంది. ఆ శవం అందులో ఉన్నంతవరకు కంపు పోదు. ఆ వాసన పోవాలనుకుంటే ముందు అందులోనుంచి ఆ కుక్కను తీసెయ్. అలాగే నీ అజ్ఞానం పోవాలంటే ముందు నీలోని 'నేను'ను తీసివేసుకోవాలి.

గీతలో ఒకే విషయం రెండు మూడు సార్లు వస్తుంది. అంటే అది ఎంతో ముఖ్యమైనది అయినప్పుడే అలా మళ్ళీ మళ్ళీ చెబుతాం.9వ అధ్యాయంలో (శ్లో 34) -

**మన్మనాభవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః ॥**

అని, తిరిగి18వ అధ్యాయంలో(శ్లో 65)

**మన్మనాభవ మద్భక్తో మద్యాజీమాం నమస్కురు ।**
**మామేవైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోసిZ మే ॥**

అని వస్తుంది.ఇందులో నమస్కారయోగం చెప్పారు. 'నీ మనస్సు నాకు అర్పించు' అంటున్నాడు భగవానుడు. కాని మనం అదిమాత్రం ఇవ్వం. మనని దేహం, మనస్సు, చైతన్యం అని మూడుగా విభజించవచ్చు. వాటిలో దేహం జడం. దానికిఏమి చెప్పినా ప్రయోజనం లేదు. చైతన్యానికి చెప్పవలసిన అవసరమే మేదు. ఏది చెప్పినా మనస్సుకే.

ఒకాయన రోజూ రామాయణ కథా శ్రవణానికి వెళ్ళేవాడు. భార్యకు ఇవేమీ పట్టవు. ఆమెకు ఇల్లే కైలాసం. ఎలాఅయినా భార్య రామాయణం వింటే మార్పువస్తుందని భర్తకు ఉంది. 'నువ్వుగాని రామాయణానికి వెళ్తే, నీకు సొసైటీ పట్టుచీర కొనిపెడతాను' అన్నాడు. సరే అని ఆమె కథా శ్రవణానికి వెళ్ళింది. భర్త అడిగాడు " ఏం చెప్పారు'' అని. భార్య "అక్కడకు పోయినా నా మొహాన్న మొద్దులు పెట్టారు. అక్కడా సీత పాతివ్రత్యం గురించే చెప్పారు'' అంది.

అర్జునుడు " నా మనస్సు నా దగ్గర ఉంటే ఉపద్రవం కలిగిస్తుంది అన్నావు మరి నీ దగ్గర ఉంటే అది నీకు ఉపద్రవం కలిగించదా?''అని అడుగుతాడు. దానికి కృష్ణుడు "లేదు! ఆ మనస్సు నా దగ్గర ఉంటే అది నేను ఎలా చెపితే అలా వింటుంది. ఒక సత్యం తెలిసికో. నేను దేవుడిని. నువ్వు జీవుడివి... పాములను ఆడించేవాడికి పామును ఎట్లా వశం చేసుకోవాలో తెలుసు. పాము ఎప్పుడూ వాడిని కాటు వేయదు. అది వాడు ఎట్లా చెప్తే అలా ఆడుతుంది. ఆయన ఒక పామును పడకగా చేసుకున్నాడు. ఒక పాము పడగలపై ఆడాడు. పాముకి రెండు లక్షణాలు - వంకరటింకరగా నడవటం, కరవటం. కాని మనస్సు అనే సర్పానికి అయిదు ఉన్నాయి - శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలు. ఎవరైతే మనస్సును వశంచేసికొంటారో వారికే జ్ఞానం కలుగుతుంది. మనస్సు శుద్ధమని అశుద్ధమని రెండు విధాలు - ధర్మానురూప కామసంకల్పం చేసే మనస్సు శుద్ధం. విషయాలను రికార్డుచేసే మనస్సు అశుద్ధం.

నామ సంకీర్తన, ప్రణవ జపం, మెడిటేషన్ (ధ్యానం), భక్తి, విచారణ చేసుకో. " అట్టి మనస్సుతో నన్ను పూజించు, నాకు నమస్కరించు. అలా చేస్తే నువ్వు నన్నే పొందుతావు'' అని శ్రీకృష్ణ భగవానుడు గీతలో చెప్పాడు.
అదే నమస్కారయోగం. అజ్ఞానం రహితమవటానికి తరణోపాయం!!

# సంత్ నామదేవ్ చరితామృతం

-మనోజ్ కుమార్

పుండరీకుడికోసం నారాయణుడు పండరి వచ్చినట్లు, నామదేవుని అభంగాల కోసం భక్తులు ప్రవాహంలాగా పండరికి రావటం మొదలైంది. జాతి, వర్గం, కులం, వర్ణం, ఉచ్చ, నీచ భావములు అన్నీ మరచి నామదేవునితో పాటు అందరూ నృత్యం చేస్తున్నారు. నామదేవుడి భజనలకు అడ్డూ ఆపూ లేదు. కాలనియమం లేదు. రాత్రి ఎప్పుడో ప్రొద్దుపోయి ఇంటికి వస్తాడు. తిండి తిప్పలపైన ధ్యాస ఎలాగూ లేదు. అదలా ఉంచితే కులవృత్తిపైన ధ్యాస కూడా అసలు లేకుండా పోయింది.

నామదేవుడిని ఈ స్థితిలో చూస్తుంటే గోణాయి, దామాశెట్టి మనస్సులు చివుక్కుమంటున్నాయి. ఎదిగి వచ్చిన కొడుకు చేతికి అందివచ్చి ఆసరాగా ఉంటాడు అనుకుంటే వాడు విఠలోన్మాదిగా మారాడు. ఒక విధంగా దానికి తానే కారణమేమో. నైవేద్యం పెట్టమని పంపింది తానేకదా! కాని వీడేమో ఏకంగా నైవేద్యం తినిపించి వచ్చాడు.

దామాశెట్టిగారి ఆలోచనలు తెగటం లేదు. ఇంతలో నామదేవుడు పాడుతున్న పాట సన్నంగా, మధురంగా వినిపిస్తున్నది. 'పాండురంగా! నీవు తల్లివి, నేను నీ బుజ్జిగాణ్ణి. ప్రేమక్షీరాలు త్రాగించు. నీవు గోమాతవు, నేను నీ వత్సాన్ని. భక్తక్షీరాల చేపు ఆపకు. నీవు తల్లి పక్షివి. నేను నీ పిల్లపక్షిని. పక్షికూనకు మేత పెట్టవా? తల్లి తాబేలు ఎక్కడ ఉన్నా కేవలం తన సంకల్ప మాత్రం చేత పిల్లలను సంరక్షిస్తుంది.నీవు పెద్ద తాబేలువి కదా! నేను నీ పిల్ల తాబేలును. నన్ను సంరక్షించే భారం నీదే'.......... ఏదో విధంగా వీడికి పెళ్ళిచేసి నెమ్మదిగా కులవృత్తిలోకి దింపితే వీడు దారిలో పడవచ్చేమో అనిపించింది దామాశెట్టిగారికి.

దామాశెట్టికి శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై వరం కోరుకోమన్నాడు. ఆయనకి ఏం కోరుకోవాలో తోచలేదు. 'దేవాదిదేవా!' అని మాత్రం అనగలిగాడు. శ్రీకృష్ణుడే తిరిగి 'మీ ఒక్కగానొక్క కొడుకు నా ధ్యాసలో పడి సంసారం పట్ల అయిష్టంగా ఉన్నాడని, అతనికి వ్యవహార జ్ఞానం లేదని, మీ వంశం నిర్వంశం అవుతుందని ఒక చింత మీ మనస్సును శల్యంలా పీడిస్తున్నది. నామదేవుడు భక్తరాజు. అతడు ముందు నా వాడు. తరువాతనే మీ వాడు. అటువంటివాళ్ళ

సంసారమోహంలో చిక్కుకోకూడదు. మీరు ఒకవేళ అతనికి ఏదైనా లౌకిక వ్యవహారం అప్పగించినా అతడు అందులో రాణించలేడు. అయినా మీ ప్రార్థనను మన్నించి, అతనికి ఇష్టం లేకపోయినా మీ ఆజ్ఞకు బద్ధుడై వివాహం చేసికొని పుత్రప్రాప్తిని పొందేలా అనుగ్రహిస్తున్నాను. కాని మీ మనుమలు మాత్రం అతణ్ణి సంసారంలో పడనీయకుండా, భక్తి, నామ సంకీర్తన పథంలో అతని పురోగమనానికి దోహదం చేస్తారు' అంటూ గుమ్మం వరకూ సాగనంపాడు.

దామాశెట్టి కళ్ళు తెరిచాడు. ద్వారకలేదు, శ్రీకృష్ణుడూ లేడు. తన పక్కపైన తాను ఉన్నాడు. పక్షుల కిలకిలా రావాలతో పూర్తిగా మెలకువ వచ్చింది. అయితే ఇదంతా కలయేనా! కాని ఆహా! ఎంత మధురమైన స్వప్నం!

ఆలయంలో నామదేవుడికి పాండురంగడి వాణి వినిపించింది. 'నామా! నీవు అమ్మకు మాట ఇచ్చిన ప్రకారం పెళ్ళి చేసికొని సంసారం చేయవలసిందే. అయినా భయపడవద్దు. నిన్ను ఒక్క క్షణం కూడా విడిచిపెట్టకుండా నీతో ఉంటాను' నామదేవుడికి పాండురంగడి అభయం లభించింది. ఇప్పుడు అతడు పూర్వంలా బయట పిచ్చిగా తిరగటం లేదు. ఇంటిపట్టునే ఉంటూ, సూదీ దారంతో చక్కగా గుడ్డలు కుడుతున్నాడు. దామాశెట్టి దంపతులు కొడుకు దార్లో పడుతున్నాడని సంతోషించారు. అదంతా వారి భ్రమకాకపోతే మరేమిటి? వజ్రం నీళ్ళలో ఎన్నాళ్ళు నానపెట్టినా మెత్తపడుతుందా!

ఎద్దు మీద వస్త్రాల మూట సర్ది, జని ఇచ్చిన నేతి రొట్టెల మూటను, పెరుగు కుండను ఆ మూటకు తగిలించి, కనిపించినంత మేరకు పాండురంగడి గుడిపైన కలశాన్ని మాటిమాటికి వెనక్కి తిరిగి చూస్తూ మంగళవేఢ సంతకు బయలుదేరాడు నామా. కొంత దూరం ప్రయాణం చేశాక ఆకలి అవుతుంటే ఎద్దుని నీడలో కట్టేసి, దానికి నీరు, మేత పెట్టి, తను ఒక చెట్టు క్రింద కూర్చుని జని ఇచ్చిన మూటను విప్పాడు.

సరిగ్గా రొట్టెను నోట్లో పెట్టుకొనే సమాయనికి చొంగ కారుతుంటే, మూటవైపే ఆశగా చూస్తూ, బాగా ఆకలిగా ఉన్నది, నాకూ పెట్టవా అంటున్నట్లు కుయ్, కుయ్........ అని అరుస్తూ నామా ఎదురుగా తోకాడిస్తూ కూర్చున్నది ఒక బక్కచిక్కిన కుక్క ఎప్పుడనగా తిన్నదో దాని ఆకలంతా దాని చూపులలో ప్రతిఫలిస్తున్నది. దానిని చూడగానే నామదేవుడు 'పాండురంగా! నన్ను

విడిచిపెట్టకుండా, నా వెంటే నన్ను అంటిపెట్టుకొని వస్తున్నావు కదూ! నిన్ను ఉపవాసం చేయనిస్తానా? ఆరోజు నైవేద్యం పళ్ళెం ముందు పెట్టి తినమంటే ఎంత బెట్టు చేశావు? ఈ రోజు ఎలా తినవో చూస్తాను' అంటూ నేతిలో బాగా వేయించిన ఆ రొట్టెల మూటను ఆ ప్రత్యక్ష పాండురంగడి ముందు పెట్టాడు. క్షణంలో సగం అన్నా పూర్తికాక ముందే ఆ ప్రత్యక్ష పాండురంగడు మూటంతా ఖాళీ చేశాడు. ఒక్క నలుసైనా మిగలకుండా మొత్తం అంతా నాకేసి, తృప్తిగా చెట్టునీడలో విశ్రమించాడు. పాండురంగడు తృప్తి పడ్డాడు. నామా ఆనందించాడు. మొదటిసారిగా ఆకలి బాధ ఎలాంటిదో నామాకు ఆరోజు అనుభవపూర్వకంగా తెలిసింది.

నామదేవుడు సంతకు చేరుకున్నాడు. అందరూ వ్యాపారంలో రకరకాల లాఘవాలను ప్రదర్శిస్తుంటే, తను జోలెలో నుంచి చిడతలు తీసి సంకీర్తన మొదలు పెట్టాడు. పండరి మా సంత, భక్తి మా వ్యాపారం, విఠల నామమే మాకు వడ్డీ......... ఒక పెద్దకులం అతను చిరుగుల గోచి పెట్టుకొని, నామదేవుడి పండలం ముందు నిలబడి నామావైపే చూస్తున్నాడు.

నామదేవుడు వాణ్ణి చూసి 'ఏం కావాలి?' అని అడిగాడు. వాడు 'ఏమీ వద్దులెండి. చేతిలో రాగిపైసా అయినా లేనివాణ్ణి, ఊరికే చూస్తున్నా' అని మొహమాట పడ్డాడు. నామదేవుడికి అక్కడ విఠలుడే నిల్చుని కనబడ్డాడు. అతనికి ఒక ధోవతి, అంగీ ఇచ్చి కట్టుకోమన్నాడు. 'వద్దండీ, మా ఇంట్లో ఎవరికీ బట్టలు లేవు. అందుకే మా ఆడదిబయటకు కూడా రావటం లేదు' అన్నాడు. నామదేవుడు 'ఔను సుమా! నీకు ఒక సంసారం ఉన్నదన్న సంగతే మరచాను' అంటూ అందరికి సరిపడ బట్టలు ఇచ్చాడు. నామదేవుడికి అందరూ విఠలుడి రూపాలుగా, అంతా విఠలుడి సంసారంగా దర్శనమైంది.

ఆనందంతో మైమరచి నామదేవుడు 'అందరూ రండి. అందరికీ ఏమి కావాలో అవి పట్టుకెళ్ళండి' అని అరుస్తూ నాట్యం చెయ్యటం మొదలు పెట్టాడు. ఆ పెద్ద కులంవాడు ఆ బట్టలు కట్టుకొని మహదానందంతో 'ఓ మహాదేవా!, ఓ చిత్కళా! ఓపార్వతీ! చంద్రా, గణపతీ, చింగా, చీమా అందరూ పరుగు పరుగున రండి. ఇక్కడ విఠలుడు బట్టలు పంచిపెడ్తున్నాడు' అని అందరికీ వినబడేలాగా కేకలు వేస్తున్నాడు.బీదా, బిక్కీ, దీనులు, దరిద్రులు, అగ్రవర్ణాల వారిచేత తిరస్కరించబడినవారు అందరూ నామదేవుడి చుట్టూ చేరారు.

నామదేవుడు ప్రతి ఒక్క విఠలుడికీ తన దగ్గర ఉన్న వస్త్రాలన్నీ అయిపోయేదాకా అందించాడు. మూట ఖాళీ అయింది. మూట కట్టిన వస్త్రాన్ని కూడా ఇచ్చేసి కట్టుబట్టలతో మిగిలిపోయాడు నామా.

అప్పుడు కనిపించాడు ఒక దొమ్మరి. దొమ్మరివాడేమిటి? పాండు రంగడే ఆ రూపం ధరించి అక్కడ నిలబడ్డాడు. అతడికేమీ ఇవ్వలేదు. అంతా ఖాళీ అయింది. ఆశాభూతంలాగా తను ధరించిన జలతారు అంగీ ధోవతుల వైపే చూస్తున్నాడు ఆ దరిద్రనారాయణుడు అని నామదేవుడికి అవగతం అయింది. వెంటనే 'పాండురంగా! ఇంకా ఇదొకటి ఉన్నది కదా నా దగ్గర ఇదిగో చివరగా ఇది కూడా నీకే అర్పిస్తున్నాను' అంటూ తాను ధరించిన ధోవతిని, అంగీని ఆ ప్రత్యక్ష విఠలుడికి అర్పించాడు.

నామదేవుడి మనస్సు ఇప్పుడు హాయిగా ఉంది. కాని బట్టలు లేకుండా ఇంటికి ఎలా వెళ్ళటం? 'నాన్నా! నీ చినిగిన తుండుని నాకివ్వవా? కాస్త ఇంటికి చేరేదాకా చుట్టుకుంటాను' అడిగాడు నామా. 'ఇదిగో! తీసికో. అన్నీ కిటికీలే. ఇది దేనికి పనికి వస్తుంది?' అంటూ ఆ చినిగిన తుండుని ఇచ్చాడు అతడు.

ఆ తుండుని తుంటికి చుట్టుకుని నామదేవుడు మైమరచి, విఠలుణ్ణి కీర్తిస్తూ ఆనందంగా నాట్యం చేస్తుంటే, 'మీ రాకవలన ఈ రోజు సంత తిరునాళ్ళుగా కాక తీర్థంగా మారింది' అంటూ ఆ గ్రామపెద్ద నామదేవుని పాదాలపై పడ్డాడు. కానీ నామదేవుడు ఈ లోకంలో లేనట్లు బ్రహ్మానందంలో చిత్తుగా మునిగి జై జై విఠలా! జై జై విఠలా! అంటూ అఖండ నామ సంకీర్తనలో పరవశించిపోయి ఉన్నాడు. దూరం నుండి ఆ దృశ్యాన్ని చూసిన సదావర్తిశెట్టి తన జీవితం ధన్యం అయింది అనుకున్నాడు. తన కూతురు రాజాయిని అటువంటి భక్తశిఖామణికి ఇచ్చి పెళ్ళి చేస్తే తన వంశం అంతా తరిస్తుంది.

సంతలో ఏం జరిగిందో, సంత నుండి తిరిగి వచ్చిన శ్యామప్పశెట్టి దామాశెట్టికి అక్షరం కూడా పొల్లుపోకుండా అంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. అది వింటూ అందరూ అవాక్కయ్యారు. మౌనంగానే నామదేవుడు ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూస్తున్నారు. ఎప్పుడో రాత్రి బాగా పొద్దు పోయిన తరువాత వాకిట్లో ఎద్దు మెడలో కట్టిన గంట వినిపించింది. బయటకి వచ్చి చూస్తే శివుణ్ణి వదలి నంది ఒక్కడే వచ్చినట్లు ఎద్దు ఒక్కటే ఉన్నది. నామదేవుడి జాడ లేదు.

-సశేషం

# జ్ఞాన పుష్కరిణి

- సుషుమ్న ప్రసాద

అది ఆ తల్లి గురుమహరాజ్ ప్రసాదించిన అపూర్వ వరముగా భావించి, తన కర్తవ్యం నిర్వహించేది. ఆధ్యాత్మిక విద్య నేర్పించటంలో అపర సరస్వతిగా, సంతృప్తిగా భోజనం పెట్టటంలో అపర అన్నపూర్ణగా భాసిల్లారు. మా కామేశ్వరక్క (ఆమె కూడా పెద్దక్కయ్య అనే పిలుస్తారు) గురువుగారు తనకు స్ఫూర్తిప్రదాయిని, మార్గదర్శినియని ఆనందంగా చెప్పుకొంటారు. అలాగే డా॥స్వర్ణ, చంద్రావతి, శారద, కమలమ్మ మున్నగు భక్తసోదరీమణులు, డా॥కృష్ణార్జునరావుగారు. డా॥అశోక్, పాండుగారు, డా॥ప్రసాదరావుగారు, లాల్‌గారు మున్నగు భక్తసోదరులు (ఉదాహరణకు కొన్ని పేర్లు మాత్రమే పేర్కొనటం జరిగింది. అందరిపేర్లు అంటే పేజీలు నిండిపోతాయి). ఆమె వాత్సల్యమును సతతము స్మరిస్తూ ఉంటారు.

పూజ్యశ్రీమాతాజీ గురువుగార్కి ముద్దుల బిడ్డ, చిట్టితల్లి. ఆశ్రమములోని కార్యక్రములు, నేను సక్రమంగా నిర్వహిస్తాను. దేశవిదేశాల్లో సత్సంగ సమావేశములు దిగ్విజయంగా నిర్వహించి, గురుదేవుని దివ్యసందేశాన్ని వ్యాప్తిచేయమని ప్రోత్సహించేది.

తాను సద్గురుదేవుని అనుగ్రహ విశేషముతో పొందిన దివ్యానుభూతులనందరికీ పంచిపెట్టి, అందరూ ఆ దివ్యానందమును పొందాలన్నదే ఆ మాతృమూర్తి ఆశయము, ధ్యేయము. నిస్వార్థసేవలో ఆమె నిష్ణాతురాలు.

మాతృవాత్సల్యము నాకేకాకుండా అందరికీ పంచిపెట్టారు. ఆ మాతృమూర్తి మమతకు నిలయము. జ్ఞానరత్నాలను పుష్కలంగా వెదజల్లిన ఆ జ్ఞానవాహిని నిరంతరమూ ప్రవహిస్తూనే ఉంటుంది.

ఆ జ్ఞాన పుష్కరిణిలో, మనమందరమూ భక్తి ప్రపత్తులతో జలకమాడి, పవిత్రతను సంతరించుకొని ఆ మాతృమూర్తికి నివాళులర్పిద్దాం!!

# వార్తలు - విశేషాలు

**ఫిబ్రవరి**

1 **విజయవాడ,** యస్.వి.యస్ కళ్యాణ మంటపంలో, శ్రీసద్గురు లలితా త్రికోటి మహాయజ్ఞం జరిగింది. శ్రీమాతాజీవారుముందుగా అనుగ్రహ భాషణం చేశారు. అనంతరంఅక్కడ భక్తులచేత సామూహిక కుంకుమపూజలు  చేయించారు.

**2 - 4 వరకు కేశవరం గ్రామం** (గణపవరం మండలం), ప॥గో॥జిల్లా శ్రీఉమాకొండ మల్లేశ్వరస్వామివారి దేవస్థానంలో శ్రీసౌరయాగం సందర్భంగా శ్రీమాతాజీ ప్రవచనంచేశారు

**5 పెద నింద్రకొలను** శాఖలో భీష్మఏకాదశి శ్రీసద్గురుమూర్తి ప్రతిష్ఠా అయిదవ వార్షిక మహోత్సవమునాడు శ్రీ మాతాజీ శ్రీసద్గురుపాదపూజ చేయించి అనంతరం తమ అనుగ్రహభాషణం చేశారు

**6 - 7  గండిక్షేత్రం**లో కడపజిల్లా శ్రీభూమానందాశ్రమంలో శ్రీసద్గురుజ్ఞానసదస్సు, సాధుసమ్మేళనములో పాల్గొన్నారు.

**17 - 21 భీమవరం**, ప॥గో॥జిల్లాలో శ్రీమాతాజీవారి సత్సంగ సమావేశాలు జరిగాయి ది. 19 న సామూహిక పూజలు, శ్రీ సద్గురు పాద పూజ జరిగాయి.

**19 గణపవరం** ప॥గో॥జిల్లాలో, శ్రీసాయిబాబా ఆలయంలో శ్రీమాతాజీవారి ప్రవచనం. వివరములకు - సెల్ 9490107589

26 **గాగిళ్ళపురం**, కరీం నగర్ జిల్లా, అఖిలాంధ్ర సాధుపరిషత్ 44వ సభలో శ్రీమాతాజీవారు అభిభాషణ చేశారు.

**మార్చి 2009**

**3 - 5 వాక్కాడి గ్రామం**, జలగాం జిల్లా, మహారాష్ట్రలో శ్రీగురుప్రభ పవర్ లిమిటెడ్‌వారి ఆవరణలో శ్రీసద్గురుగణపతి హనుమత్ చండీ యాగం, సత్సంగ సమావేశము, 5వతేదీన శ్రీశ్రీశ్రీ హనుమత్కాళీ వరప్రసాద్‌బాబూజీ మహరాజ్, శ్రీఆంజనేయ స్వామి, శ్రీ విఘ్నేశ్వరుడు -త్రిమూర్తుల  ప్రతిష్ఠా మహోత్సవము. వైభవంగా జరిగాయి.

**11 షోలాపూర్**లో  83వ శ్రీసనాతన వేదాంత జ్ఞానసభలో శ్రీమాతాజీ పాల్గొన్నారు. ఆధ్యాత్మిక ప్రవచనం చేశారు.

12 **తెనాలిలో** శ్రీఅష్టలక్ష్మి అమ్మవారి జయంతి సందర్భంగా పరమపూజ్య శ్రీ దండి నిర్మలానందగిరిస్వామివారి ఆధ్వర్యములో జరుగుతున్న శ్రీ అమ్మవారి ఊంజలసేవలో మాతాజీ పాల్గొన్నారు.

**18 - 20 ఈదుల బళ్ళాపురం గ్రామం**, అనంతపురం జిల్లా, శ్రీరామకృష్ణ ఆశ్రమంలో జరుగు వార్షిక సత్సంగ సమావేశములలో శ్రీమాతాజీవారు పాల్గొని తమ దివ్య సందేశాన్ని భక్తులకు అందజేశారు.

చిత్రాలను ప్రక్కపేజీలో చూడవచ్చు.

భీమవరం





వాక్కాడి(జలగాం)





గాగిళ్ళపురం

షోలాపూర్





తెనాలి

ఈదుల బళ్ళాపురం





# మౌనధ్యాన సప్తాహశిబిరం

-రమణ ప్రసాద్

సన్నజాజి ఎలా ఉంటుంది? మల్లెపూవులాగా.

మల్లెపువ్వు ఎలా ఉంటుంది? కాగడా లాగా - మరి కాగడా పువ్వుకి వాసన లేదు కదా! మల్లెపువ్వు మల్లెపువ్వు లాగే ఉంటుంది. అలాగే చిన్నారిఎలా ఉంటాడు? చిన్నారి చిన్నారి లాగే ఉంటాడు. చిన్నారి చిన్నారే. సృష్టిలో బలే పోలికలు పెట్టాడు. ఒకరిని చూసి వీళ్ళు ఇంకొకరిని పోలిన వాళ్ళంటామే కాని ఎవరికి వారే. కౌసల్య, కైకేయి, సుమిత్రలు బాలరాముని ఆడిస్తున్న తీరును మనోవీధిలో వీక్షిస్తున్న తులసీదాసుకు గొప్ప చిక్కు వచ్చింది -

ఠుమక్ చలత రామచంద్ర బాజత పైంజనియా। ఠుమక్ చలత ।
ఖిలఖిలాత్ ఉఠత్ దాయ్ గిరత భూమి లట్‌పటాయె
థాయె మాయె గోద్ లేత దశరథ కీ రణియా ।ఠుమక్ చలత ।
తులసిదాస్ అతి ఆనంద్ నిరఖికే ముఖారవింద్
రఘువర్ కీ ఛబి సమాన్ రఘువర ముఖబనియా। ఠుమక్ చలత ।

శ్రీబాబూజీ మహరాజ్ వారు ఈ పాట పాడుతూ, పాడించుకొంటూ కూర్చునే కాలితే అడుగు వేసేవారు. మహా బోధామృతం అందిస్తూ అడుగు వేసేవారు. ఇంకా విషయాదులలోనే ఉన్నావా? ప్రపంచంలోనే ఉన్నావా? అని మన గుండెల్లో అడుగు వేస్తున్నారు. ఇప్పటికీ వేస్తూనే ఉన్నారు. నువ్వు అది గుర్తించేవరకూ ఆ అడుగుల ధ్వని వినిపిస్తూనే ఉంటుంది. ఆ బాల రాముడు నవ్వుతూ పడుతూ లేస్తూ ఉంటే ఆ తల్లులు మురిసి పోతూ రాముణ్ణి ఎత్తుకొంటారు. ఎవరి ఆనందం వారిది.' నేను పైకి వెళ్ళినప్పుడు నాకు ప్రసాదం పెడితే తిని వచ్చాను' అని ఎవరైనా మనతో అంటే మనకి అది తృప్తిని ఇస్తుందా? ఆ ఆత్మానుభూతి ఎవరిది వాళ్ళదే. అక్కడ రాముడు పడ్డప్పుడు భూదేవికూడా అలానే పట్టుకుంది. అబ్బా! నాకు రాముని స్పర్శ తగిలింది కదా అని సంతోషపడింది. అప్పటికే ముగ్గురు తల్లులు గబ గబా వచ్చి రాముణ్ణి ఎత్తుకొన్నారు. ఉన్నది ఒక్కడే! ఆ మూడు సత్త్వ, రజస్తమోగుణాలు. పరమాత్మ వస్తువు అయిన స్వామిని మన ఆత్మ అంటుకొనే ఉన్నది. ఆ కనెక్షన్ లేపోతే మనం తద్దివిట దివిటే! అదే చైతన్యం. అది ప్రాణరూపంలో మనలో లేకపోతే ఈ శరీరం తగలపెట్టటానికి మాత్రమే పనికి వస్తుంది. మా ఇంట్లో ఇలాంటి మూర్తే ఉంది. ఆ మూర్తిని ఎలా అలంకరించుకుంటే బాగుంటుంది? ఎలా చేస్తే బాగుంటుంది అనుకొంటాం. సద్గురుదేవులకు పైపైన చేసే సేవలు, అలంకారాలు కాదు. మనస్సులో ఆనందం కావాలి. తులసీదాసు ఆ లీలా వైభవాన్ని ఆనందిస్తూ,

చాలా బాగుంది! ఈయనలాగా ఎవరు ఉంటారు? ఎవరితో పోల్చాలి? అని వెతికాడు. వెతికి వెతికి చివరికు రఘువర ప్రకాశానికి సరియైనది ఆయన ముఖ చంద్ర బింబమే! అని తేల్చాడు. అన్నిటికన్నా గొప్పవాడు ఆయన ఒక్కడే. గురుదేవులకు ఒక్కటే బాధ. వారు పొందే ఆనందం మనమూ పొందటం లేదే అని. వారిది తెలిసిన బాధ. అటువంటివారిని గురించి మనం ఏమి చెప్పుకోగలం!

**లోక కళ్యాణముకై లీల దేహము దాల్చు సాకార బ్రహ్మంబు సాక్షియును ఇతడే । రాగదే చిత్తమా ।**

మనం బోధ విన్నాం. సాకారంగా చూశాం. సాకార బ్రహ్మముపై ఏకాగ్రమైన మనస్సు నిరాకారమవుతుంది. సాక్షాత్కారమవుతుంది. సాకార బ్రహ్మనికి సాక్షి ఎవరు? నువ్వు ఆశ్రయించిన ప్రభువే! వారే అవతారాన్ని ధరించి మనకు సాక్షాత్కరించారు. ఇది వారి ప్రసాదమన్నమాట. అటువంటి ప్రభువు ఎటువంటివాడు? **వేదాంతములోన వేదితవ్యంబైన శాస్త్రాలచే బహుళ సంకీర్త్యమై ఉన్న మౌనీంద్రకోటిచే ధ్యానింవబడుచున్న బ్రహ్మమే యీతండు భ్రమయేల వేవేగ । రాగదే చిత్తమా ।** ముని అంటే మననశీలుడు. మౌనానికి భాషలు ఎక్కువ. నోరు మాట్లడటం మానేస్తే మనస్సు మాట్లాడుతుంది. ప్రపంచంలో ఉండి మౌనం వహిస్తే అది వ్యష్టి. అంతర్ముఖులై మౌనం వహించేవారు మహనీయులు. వారు లోపల భగవంతుని వెతుకుతారు. అది ప్రణవానికి మూలస్థానమైనది. అదేబ్రహ్మం. భ్రమకాదు. అది బ్రహ్మ వస్తువే. రాగదే చిత్తమా? ఇంక ఎక్కడకు వెళతావు? ఇంకా మన ప్రభువు ఎటువంటివాడు?

**ప్రేమవాహిని యితడు కామధేనువు యితడు**
**కామదూరునిచేసి కడతేర్చు తెలియవే**
**మోహశృంఖలజిక్కి మొరపెట్టనింకేల**
**పట్టవే బంగారు పాదపద్మములను । రాగదే చిత్తమా ।**

అతడు ప్రేమ స్వరూపుడు. ఎలా తలచుకున్నా ఆయన ప్రేమే ఎల్లప్పుడూ వర్షిస్తుంటుంది. అది అవసరార్థ ప్రేమ కాదు. అవ్యాజమైన ప్రేమ. అది పూర్ణమైన ప్రేమ. జీవుడికి అలౌకిక ప్రేమను ప్రసాదించే ప్రేమ. మనకు గురుస్మరణ దొరికింది. గురు ప్రసాదం దొరికింది. ఇంకా మోహపాశాలలో ఎందుకు బంధింపబడటం? ఓ మనసా! ఆ బంగారు పాదాలను ఆశ్రయించు. ఆ ప్రభువు ఎనలేని సుజ్ఞానగుణమణి. ఆ ప్రభువు అమృతానందాంబోధాంబుధిలో మునకలు వెయ్యి. అందులో కరిగిపో. అదే గురుదేవుల అనంత తత్త్వం. అది అఖండం, సర్వవ్యాపకం. మనం ఆ గురుతత్త్వంలోనే ఉన్నాం. వారి బోధామృతంలో ఓలలాడుతూ ఉప్పుబొమ్మ సముద్రంలో కరిగిపోయినట్లు అందులో కరిగిపోదాం. సద్గురుదేవులు మనకు అట్టి భక్తిని,శక్తిని, సాధనా శక్తిని ప్రసాదించెదరుగాక! సుఖీభవ! సుఖీభవ!!

# వార్తా కదంబం

**ఏప్రియల్ 09**

3 శుక్ర పెనమలూరు -శ్రీరామనవమి - సాయంకాలం శ్రీ పరమాత్మా నందాశ్రమంలో శ్రీ పరివ్రాజక మహా సదస్సు రజతోత్సవం సందర్భంగా శ్రీ మాతాజీవారి అభిభాషణ.

5 ఆది ప్రకాశం జిల్లా, చెరుకూరు గ్రామంలో శ్రీ సుబ్బదాసస్వామివారి ఆరాధన కార్యక్రమంలో శ్రీ మాతాజీ వారు పాల్గొంటారు. అనంతరం శ్రీమాతాజీవారి అభిభాషణ. వివరములకు 9441421256

7 మంగళ ఖమ్మం, సామూహిక కుంకుమపూజలు శ్రీ మాతాజీవారి అధ్వర్యంలో జరుగుతాయి. వివరములకు శ్రీ వేములపల్లి వెంకటేశ్వరరావు గారు 08742 - 224406, సెల్ - 9848156124,

8 - 10 బుధ - శుక్ర శ్రీ శుకబ్రహ్మాశ్రమం, కాళహస్తిలో శ్రీ మాతాజీవారి ప్రవచనం. వివరములకు 08578 - 222239

**మే 09**

ఏప్రిల్ 30 నుండి 2 మే గురు- శని వరకు కృష్ణాజిల్లా, తోట్లవల్లూరు మండలం, దేవరపల్లిలో ది. 1-5-09 శ్రీదుర్గానాగేశ్వరస్వామివారి దేవస్థానము నందు తె॥జా విఘ్నేశ్వరపూజ, పుణ్యాహవచనము, అఖండ దీపారాధన, మహన్యాసపూర్వక రుద్రాభిషేకము, లక్షబిల్వార్చన జరుగును. ఉదయం 7గం.30ని॥లకు అమ్మవారికి లక్షకుంకుమార్చన, హారతి, మంత్రపుష్పము జరుగును. అనంతరం తీర్థ ప్రసాదవితరణ. ది.2-5-09 శ్రీకోదండరామస్వామి ఆలయంలో ఉదయం 5గం.లకు విష్వక్సేన పూజ, పుణ్యాహవచనము, మంటపారాధన, చతుర్దశ కలశస్థాపన, గోపూజ, లక్షతులసిపూజ, శ్రీసీతారామ కళ్యాణం. నీరాజనం, మంత్రపుష్పం, తీర్థప్రసాద వితరణ. శ్రీ మాతాజీవారి సత్సంగ కార్యక్రమం. వివరములకు 0866 - 2805941

4 సోమ ప్రకాశం జిల్లా, చెరుకూరులో శ్రీ వీరబ్రహ్మేంద్రస్వామివారి ఆరాధనా మహోత్సవంలో శ్రీ మాతాజీ పాల్గొంటారు. వివరములకు 9441421256.

13- 15 బుధ - శుక్ర కర్నూలు జిల్లా, బండ్ల, ఆత్మకూరులో శ్రీ మాతాజీవారి ఆధ్వర్యంలో ప్రతిష్ఠా మహోత్సవం.

16 - 19 శని - సోమ పెదనింద్రకొలను శాఖలో శ్రీ మాతాజీవారి సత్సంగ సమావేశాలు. వివరములకు 9440124322,9440377399.

# ఆశ్రిత ధర్మం

(శ్రీమదాంధ్ర భారతం. అనుశాసనిక పర్వం)

కాశీరాజు రాజ్యపాలన చేస్తున్న కాలంలో బోయవాడొకడు అరణ్యంలో వేటాడుతూ విషం పూసిన బాణాన్ని ఒక మృగానికి గురిచూసి వదిలాడు. ఆ బాణం గురితప్పి అక్కడ ఉన్న ఒక వృక్షానికి గుచ్చుకున్నది. విషప్రభావం వల్ల అంతవరకు పూలతో, తీయని ఫలాలతో పచ్చగా కన్నుల పండువుగా ఉన్న ఆ మహావృక్షం క్షణంలో మాడి మ్రోడుగా అయిపోయింది. అయినా ఆ చెట్టు తొఱ్ఱను ఆశ్రయించుకుని వాసం చేస్తున్న ఒక చిలుక మాత్రం ఆ చెట్టును వదిలి వెళ్ళలేదు. తనకు ఎంతో కాలంగా నీడను ఇచ్చిన ఆ వృక్షమునందలి భక్తితో ఆ చిలుక శీతాతపాలకు, వర్షాలకు వేటికీ చలించక, అన్నిటినీ ఓర్పుతో సహిస్తూ అక్కడే ఉంటున్నది.

ఈ విషయం ఇంద్రుడు తెలిసికొని, మనుష్య రూపంలో అక్కడకు వచ్చి ఆ చిలుకతో 'ఓ కీరమా! ఈ చెట్టు ఎండి బెండైపోయింది. ఈ అరణ్యంలో చక్కటి నీడనిచ్చే పుష్ప ఫల భరితమైన వృక్షాలు చాలా ఉన్నాయి. దీనిని విడిచిపెట్టి స్వాదు ఫలాలనిచ్చే మరొక వృక్షాన్ని ఆశ్రయించి సుఖంగా ఉండు' అని హితవు చెప్పాడు. దానికి ఆ చిలుక ' మహేంద్రా! నీకు నమస్కారం. తీయని ఫలాలను ఇస్తున్నంత కాలమూ ఆశ్రయించి, ఎండిపోగానే దానిని విడచి ఎగిరిపోవటం కృతఘ్నుత అనిపించుకోదా? ఆశ్రితులకు అది ఆచరణీయమేనా?' అని సమాధానం చెప్పింది.

ఇంద్రుడు ఆశ్చర్యపోయి 'నేను మారువేషంలో ఉన్నా తన పురాకృత పుణ్య విశేషం వల్ల నన్ను గుర్తించిన ఈ చిలుకకు మేలు చేసెదనుగాక!' అనుకొని 'ఓ శుకమా! నిజంగా నీ పలుకులు మెచ్చదగినవి. సారధర్మములు. ఏదైనా వరం కోరుకో!' అన్నాడు. అప్పుడా చిలుక 'ఓ దేవేంద్రా! ఇంతకాలం నిస్స్వార్థంగా ఎందరికో, చివరకు తనకు హాని కలిగించేవారికి కూడ ఎన్నో విధాలుగా ఉపయోగపడుతూ, అందరికీ తీయని ఫలాలను ఇస్తూ, మా వంటి పక్షి సంతతికి ఆవాసమై, తన తప్పు లేకనే మ్రోడైన ఈ వృక్షరాజమును పునర్జీవింప చేసి, దానికి పూర్వశోభను ప్రసాదించు' అని వేడుకొన్నది.

ఇంద్రుడు ఆ చిలుక ధర్మనియతికి పరమానంద భరితుడై, ఆ వృక్షం పైన అమృతం చల్లి, తీయని పండ్లతో, పుష్పాలతో పూర్వం కన్నా ఇంకా శోభాయమానంగా విరాజిల్లేలా చేశాడు. ఆశ్రయం ఇచ్చినవారిపట్ల ఆశ్రితులు నెరవేర్చవలసిన ధర్మం అలా ఉండాలి!!

# శ్రీకాళీగార్డెన్స్ ఆశ్రమము, హైదరాబాద్ సత్సంగ సమావేశములు

-నివేదిక

ఈ మనోమయ వాసనా ప్రపంచం మనలో ఉన్నందువలనే ఇంద్రియ గోచరం అవుతున్న బాహ్యప్రపంచం మనకు సుఖదుఃఖాలను కలుగజేస్తున్నది. మనలోని ఈ వాసనామయ మనోప్రపంచాన్ని మనమే సృష్టించుకున్నాము. మనమే సృష్టించిన ప్రపంచం గనుక దీన్ని నాశనం చేసే శక్తి మనకు తప్పక ఉన్నది.

మనం ఈ వాసనామయ మనో ప్రపంచాన్ని భగవదనుగ్రహంతో, గురుకృపతో నాశనం చేసుకుంటే, అప్పుడు బాహ్య ప్రపంచం మనను దేనికీ చలింపచేయలేదు. మనం స్వప్నంలో (ఈ స్వప్నం అనేది జాగ్రదవస్థ అనే స్వప్నంలో స్వప్నం) చూసే జగత్తు అందులో దేశకాలాదులు ఎంత సత్యమైనవో లేదా అసత్యమైనవో అలాగే జాగ్రదవస్థ అనబడే ఈ హిరణ్యగర్భుడి దీర్ఘ స్వప్నంలో కనిపిస్తున్న జగత్తూ, అందులోని దేశకాలాదులు కూడా అంతే సత్యము లేదా అసత్యమైనవి.

స్వప్నంలో ఉన్నవాడికి ఆ స్వప్నం జరుగుతున్నంతసేపు అందులో కనిపిస్తున్నదంతా ఎలా నిజం అనిపిస్తుందో, అలాగే జాగ్రదవస్థలో ఉన్నవాడికి, ఆ జాగ్రదవస్థ జరుగుతున్నంత వరకు అందులోవన్నీ నిజంగా అనిపిస్తాయి. స్వప్నంలో ఉన్నవాడు మేలుకొని జాగ్రదవస్థలోకి రాగానే, ఆ స్వప్నంలో తనకు ఏవేవో కనిపించినా అవన్నీ నిజంగా లేనివే అని, మిథ్య (నిజంగా లేకపోయినా కొంతకాలం ఉన్నట్లు కనిపించి, తిరిగి కనిపించకుండా పోయేవి) అని, వాటన్నిటినీ సృష్టించింది తన మనస్సే అని, స్వప్నం గతించగానే అవన్నీ తిరిగి తనలోకే వెళ్ళిపోయాయి అని ఎలా తెలుస్తుందో, అలాగే జాగ్రదవస్థలో నుండి తురీయావస్థలో మేలుకొన్నప్పుడు, ఆ జాగ్రదవస్థలో స్వప్నంలో లాగే తనకు ఎన్నెన్ని కనబడినా, ఎన్నిటినో తాను అనుభవించినట్లు అనిపించినా అవన్నీ నిజంగా లేనివే అని, మిథ్య అని తెలుస్తుంది.

స్వప్నంలో ఉన్నవాడు వాడంతట వాడు ఎలా మేల్కొనలేడో, వాడిని ఆ స్వప్నంలోని పాత్రలు ఎలా మేల్కొలపలేవో, వాడిని మేల్కొల్పటానికి స్వప్నావస్థలో లేనివాడు ఒకడు ఎలా అవసరమో అలాగే జాగ్రదవస్థ అనే స్వప్నంలో ఉన్నవాడు వాడంతటవాడు అందులో నుంచి మేల్కొనలేడు. వాడి జాగ్రదవస్థలో కనిపిస్తున్న జాగ్రదవస్థలోని పాత్రలు కూడా వాడిని మేల్కొపలేవు.

మనలను జాగ్రదవస్థ అనే ఈ అజ్ఞాన స్వప్నంలో నుండి మేల్కొల్పటానికి, మనకు జాగ్రదావస్థలో ఒక పాత్రగా కనిపిస్తున్నా, నిజానికి సర్వదా నిజజాగరూకులుగా ఉండే గురుదేవులు అవసరం.

అయ్యో! మేము కూడ ఆ శ్రీరాముడి కాలంలోను, శ్రీకృష్ణుడి కాలంలోను ఉంటే తరించి ఉండేవాళ్ళము, ఇప్పుడు ఆ అవకాశం పోగొట్టుకున్నాము అని బోలెడు బాధపడిపోతారు కొందరు. కాని అది సరైనది కాదు. ఆ శ్రీరాముడికాలంలోనూ, శ్రీకృష్ణుడి కాలంలోనూ మనమూ ఉన్నాము. కానీ అప్పుడు వారు చెప్పింది సరిగా శ్రవణం చేయక, మననం చేయక, ఆచరించక పోయినందువల్లనే ఇప్పటికీ ఇంకా జనన మరణ ప్రవాహంలో ఇలా కొట్టుకుని పోతున్నాము.

ఇప్పుడు కూడా ఆ శ్రీరాముడు శ్రీకృష్ణుడు లేడని వాపోనవసరం లేదు. అటువంటి కుంటిసాకులతో జీవితాన్ని వృథా చేసికోక, ఇకనుండి అయినా ఆ శ్రీరాముడు, శ్రీకృష్ణుడు ఏ తత్త్వస్వరూపాలో, అదే భగవత్తత్త్వ స్వరూపులై మన మధ్యలోనే మనలో ఒకరుగా నివురు కప్పిన నిప్పువలె సంచరిస్తున్న, సద్గురుదేవులను, మహాత్ములను ఆశ్రయించి, వారిని శరణుపొంది, వారు చెప్పిన దానిని బుద్ధిగా, శ్రద్ధగా, ఏకాగ్రంగా శ్రవణం చేసి, మననం చేసికొని, నిత్య జీవితంలో ఆచరణలోకి తెచ్చుకొని, భక్తియోగంలో భగవంతుడు ఏ లక్షణాలు కలవారు తనకు ఇష్టులని చెప్పాడో ఆ లక్షణాలను అలవరచుకొని, గురుకృపను సాధించి భగవంతునికి ఇష్టులమై స్వరూపానుభవాన్ని పొందాలి.

ఆశ్రమవాసి డా॥ జపమాల ప్రసాద తమ ఉపన్యాసంలో భగవంతుడు అందరిలో అంతర్యామిగా ఉన్నా, మన దృష్టి బాహ్యంగా ఉన్నందువలన, మన దృష్టిని అంతర్ముఖం చేసి, పాలలో తోడువేసి, దానిని కదపకుండా ఉంచితే అది పెరుగుగా మారి, దానిని చిలికితే మళ్ళీ మజ్జిగలో కూడ కలవని వెన్న వచ్చినట్లు, మన మనస్సు అనే పాలలో లక్ష్యార్థం అనే తోడువేసి, ఆ మనస్సు కదలకుండా ఉండేలా, మనసు వారి పాదాలవద్దే ఉంచి, అది అచలంగా అయి ఘనీభవించిన తరువాత, దానిని నామంతో చక్కగా మథించి, అందులో నుంచి మళ్ళీ ప్రపంచంలోనే ఉన్నా దానితో కలవని భక్తి అనే నవనీతాన్ని వెలికితీసి, మన భవరోగానికి వైద్యం చేసి, మనకు భగవద్దర్శనం కావించి, ఆ భగవంతునికి తనకు అభేదమని తెలియజేసేవారే గురుదేవులు అని చెప్తూ శ్రీసద్గురుదేవులకు అత్యంత ఇష్టమైన అన్నమాచార్య కృతిని సంకీర్తనం చేసి దాని భావార్థాన్ని వివరించారు.

-సశేషం

# మాతాజీ బోధామృతం

- శివ ప్రసాద్

(శ్రీ కాళీవనాశ్రమము హైదరాబాద్‌శాఖలో జనవరిలో జరిగిన సత్సంగాలలో శ్రీమాతాజీ అనుగ్రహ భాషణల సంగ్రహ రూపం)

**ధ్యానమూలం గురోః మూర్తి । పూజామూలం గురోః పదం ।**
**మంత్రమూలం గురోః వాక్యం । ముక్తిమూలం గురోః కృపా ॥**

మానవులందరూ ఒక దేహానికి అలవాటు పడ్డారు. భగవద్గీతలో భక్తియోగంలో భగవానుడు కూడా దేహధారులకు, ఇంకా దేహాభిమానం వదలనివారికి, అవ్యక్తాన్ని, నిరాకార, నిర్గుణ తత్త్వాన్ని ఉపాసన చేయాలి అంటే సాధ్యం కాదని, అది చాలా క్లేశంతో కూడుకున్నది అని వారు చాలా కష్టపడ వలసి ఉంటుంది అంటాడు.

మన గురుదేవులు కూడా మొదట భగవంతుణ్ణి లేదా గురుదేవుణ్ణి సాకారంగా, సగుణంగా ఉపాసించటం ప్రారంభిస్తే, కాలక్రమంలో ఆ సాకారోపాసన ఫలించి, అది నిర్గుణోపాసనకు ద్వారాలు తెరుస్తుంది అని చెప్పారు.

మనస్సు భగవన్నామం పైన లేదా గురుదేవుడిచ్చిన లక్ష్యార్థంపైన నిలబడితేనే అది ధ్యానం అవుతుంది. కాని మనస్సు వాటిపైన అంత తేలికగా నిలవదు. అది విషయాదులవైపే మొగ్గు చూపుతుంది. భోగభాగ్యాలనే కోరుకుంటుంది. కాని ఈ ప్రాపంచిక భోగభాగ్యాలు, సంపదలు మహాత్ములను ఎప్పుడూ ప్రలోభ పెట్టలేదు. త్యాగరాజస్వామివారు తమ మనస్సుని 'నిధి చాలా సుఖమా? రాముని సేవ సన్నిధి సుఖమా? నిజముగ తెల్పుము మనసా!' అని నిలదీసి ప్రశ్నించి, చివరకు రాముని సన్నిధిలోనే నిజమైన సుఖం ఉన్నదని తేలుస్తారు.

ఈ సృష్టి అంతా భగవంతుడిదే.

**రచా ప్రభూ! తూనే యహ్ బ్రహ్మాండ్ సారా**
**ప్రాణోంసే ప్యారా తూహి సబసే న్యారా**
**తూహీ భాయి బంధు తూహి జగత్ జనని**
**సకల జగత్‌మే ఏక్ తేరా సహారా**

**ధర్మదూద్‌సే మాతా తుమ్ హమ్‌కో పాలా**
**ఖోలో ద్వార్ విద్యాకా అపనే విస్తారా**
**హే నిర్వికార ప్రభో! యహీ వినతి హమారీ**
**దేవో దాన్ ధర్మకా అపనే భండారా**

మాతాజీ ఈ కీర్తన పాడి దాని అర్థం క్లుప్తంగా చెప్పారు. ఈ సృష్టి అంతా భగవంతుడి రచన. ఆయనే మన సర్వస్వం. తల్లీ తండ్రి బంధువులు సోదరులు అన్నీ. ధర్మం అనే పాలతో తల్లియై మనలను పోషించి, జ్ఞానాన్ని ప్రసాదించి, తన సర్వాంతర్యామిత్వాన్ని తెలియజేసి, తన అనంతమైన భండారం నుంచి మనకు దానము ధర్మము అనే గుణాలను ప్రసాదించమని ఆయనను ప్రార్థించాలి.

ఆ భగవంతుడి సృష్టి అంతటిలో మనం ఆ భగవంతుణ్ణే చూడాలి కాని వాసనల ప్రాబల్యం వలన మానవుడు తన మనస్సుతో వేరే సృష్టి చేసి, దుఃఖాన్ని అనుభవిస్తున్నాడు. ఇంద్రియాలు, మనస్సు ఒక పట్టాన చెప్పినట్లు వినవు. శ్రీ అన్నమాచార్యులవారు అందుకే .........

**హరి నీవే సర్వాత్మకుడవు స్థిరమగు భావన నీయగదే**
**పారక మానదు పాపపు మనసిది ఈ రసములలో ఎందైనా**
**నీరజాక్ష ఇది నీ మహిమేనని(నీ మయమేనని)**
**ఈ రీతుల తలపీయగదే**
**చూడక మానవు చూచెడి కన్నులు ఏడనేదైన ఇతరములు**
**ఈడనన్నింట నీ రూపముగన ఈడు లేని తెలివీయగదే**

అని వేంకటేశ్వరుణ్ణి ప్రార్థిస్తాడు. సృష్టి మారదు. మన దృష్టి మార్చుకోవాలి. మాట వినని మనస్సును మెల్లగా బ్రతిమిలాడి, అవసరమైతే భయపెట్టి దారిలోకి తెచ్చుకోవాలి.

త్యాగరాజస్వామి అందుకే.................

**మనసా ఎటులోర్తునే నా మనవిని చేకొనవే**
**దినకర కులభూషణుని దీనుడవై భజన చేసి**
**దినము గడుపుమనిన నీవు వినవదేల గుణ విహీన**
**కలిలో రాజస తామస గుణములు గలవారి చెలిమి**
**కలసిమెలసి తిరుగుచు మరి కాలము గడుపక యే**

**సులభముగా కడతేరెడు సూచనలను తెలియజేయు**
**ఇలను త్యాగరాజు మాట వినవదేల గుణవిహీన**

అని మనస్సును హెచ్చరిస్తాడు.

శంకభగవత్పాదాచార్యులవారు, కులశేఖరాళ్వారువారు కూడా శివానందల హరిలో, ముకుందమాలలో భగవంతుణ్ణి ఆ విధంగానే ప్రార్థిస్తారు. తమకు అవయవములు కలిగినందుకు అవన్నీ భగవత్సేవలో వినియోగపడేలాగ చేయమని ప్రార్థిస్తారు. కులశేఖరులైతే ఆ భగవంతుడి భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య భృత్యుని యొక్క భృత్యుని పదం లభిస్తే కూడా చాలు. నాకు ఆ పదవిని అనుగ్రహించు ప్రభూ! అని ప్రార్థిస్తాడు.

భగవదనుభూతిని పొందటానికి అన్నిటికన్న దగ్గర మార్గం సూటియైన సరళమైన మార్గం భక్తి. అది అందరికీ అనుకూలంగా ఉండే మార్గం. ధ్యానం జ్ఞానం అనేవి నిరాకారం నిర్గుణం అయితే, భక్తి సగుణం. భక్తి తొమ్మిది విధాలుగా చెప్పబడినా ఇంకా రకరకములైన భక్తులు ఉన్నా కలియుగంలో సంకీర్తన అన్నిటికన్న ప్రధానమైనదిగా, విశేష ఫలప్రదమైనదిగా చెప్పబడింది. నామ సంకీర్తనం చేయటానికి సంగీతం రాదని, రాగము, తాళము, శృతి తెలియదని విచారించనక్కర్లేదు.

**మనసార హరిభజన చేయరా నోరార నారాయణా అనరా**
**నీ నోరారా నారాయణ అనరా**
**పాటేరాదని ప్రజలు నగుదురని గాత్రశుద్ధియే కమ్మగలేదని**
**పాటకు సరియగు తాళము లేదని భయము బిడియము**
**బాధవలదురా ॥మనసార॥**
**పాటయు తాళము గాత్రమున్నను మనసే**
**లేని స్మరణే వృథరా**
**తనువొక చోట మనసొకచోట ఉన్న మానవుని జన్మమే వృథరా**
**॥మనసార॥**

సంకీర్తన చేస్తున్నప్పుడు శరీరం ఇక్కడ మనసు ఎక్కడో ఉంటే వాడి జన్మ వృథా అవుతుంది. అంతేకాదు నామం అర్థం చేసుకుంటూ చేస్తే గాని ఆస్వాదన ఉండదు. ఊరికే అర్థం చేసుకోకుండా ఏదో గబగబా పాడేస్తేనో గబగబా చదివి హమ్మయ్య! ఈ రోజు నామాలు చదవటం అయిపోయిందని ఊపిరి పీల్చుకుంటేనో కలిగే ఫలితం శూన్యం. అందుకే త్యాగరాజ స్వామి

తెలిసి రామచింతన చేయవే మనసా! అని మనస్సును హెచ్చరిస్తారు. మానవుడు అజ్ఞానంలో అన్నీ తానే చేయగలనని, కనపడని భగవంతునితో తనకు పనియేమిటి? ఆ భగవంతుణ్ణి ఎందుకు ప్రార్థించాలి? అని భావిస్తాడు.

పులికి ఎదురువెళ్ళి తుపాకీతో దానిని కాల్చిచంపగల గొప్ప ధైర్యవంతుడు ఒకడున్నాడు. అతను తుపాకీని ఎప్పుడూ దగ్గర ఉంచుకునే వాడు. ఆఖరికి పడుకుని నిద్రపోయే సమయంలో కూడా దానిని తల క్రిందనే ఉంచుకునేవాడు, దానితో ఏ క్షణంలో ఏ అవసరం వస్తుందో అని.

ఒకరోజు అలవాటు ప్రకారం తుపాకీ తలక్రిందనే పెట్టుకుని పడుకున్నాడు. ఎప్పుడు చిన్న కునుకు పట్టిందో తెలియదు. అందులో ఒక పెద్దపులి భయంకరంగా అరుస్తూ అతని మీదకు దూకింది. అతనికి ఎంతో భయం వేసింది. అది తన మెడ పట్టుకోవటానికి ప్రయత్నం చేస్తుంటే అతను తనను తాను రక్షించుకోవటానికి ఎంతో ప్రయత్నం చేస్తున్నాడు. శరీరానికి అంతటా గాయాలు అయ్యాయి. అది అతని చేతిని కొరికింది. అతను బాధతో పెద్దగా ఏడుస్తున్నాడు. అంతలో ఎవరో లేపారు.

అతనికి మెలకువ వచ్చింది. పులీ లేదు, శరీరం మీద గాయాలూ లేవు. ఎప్పుడు అవసరం వస్తుందో అని తుపాకి తలక్రిందనే పెట్టుకున్నాడు కదా! కాని కలలో పులి వచ్చినప్పుడు ఆ తల క్రింద తుపాకీని తీసుకోలేక పోయాడు. దానితో పులిని కాల్చలేక పోయాడు. ఈ జాగ్రదవస్థ కూడా ఒక స్వప్నం వంటిది. ఇందులో మేలుకోవటం అంటే జాగ్రదవస్థలో నిజజాగ్రత్త కలిగి ఉండటం. శ్రీగురుదేవులు ఎప్పుడూ నిజజాగ్రత్తలో ఉండటమే కాక అందరినీ నిజజాగ్రత్తలో ఉండమని బోధించేవారు.

భక్తి అంటే దృఢమైన నమ్మకం, భగవంతుని యందు లేదా గురుదేవుని యందు, ఆయన వాక్కులయందు అచంచలమైన విశ్వాసం కలిగి ఉండటం. అటువంటి విశ్వాసం ఉన్నవారంటే భగవంతునికి ఎంతో ఇష్టం.

ఒక ప్రాంతంలో చాలా కాలంగా వర్షాలు పడక తీవ్రమైన క్షామం వచ్చింది. మంచినీళ్ళు దొరక్క జనం అల్లాడి పోతున్నారు. ఆ గ్రామ సమీపంలో ఒక మహాత్ముడున్నాడని ఆయన్ని ప్రార్థిస్తే తప్పక వర్షం కురిపిస్తాడని ఆ గ్రామంలో వారికి తెలిసింది. వారంతా ఆ మహాత్ముని వద్దకు వెళ్ళి పరిస్థితిని వివరించి దయచేసి వర్షం కురిపించండని ప్రార్థిస్తారు.

- సశేషం

# మాతాజీ సత్సంగ్ డైరీ

-రమణ ప్రసాద్

(ఫిబ్రవరి17నుండి21 వరకు భీమవరంలోజరిగిన సత్సంగ కార్యక్రమాలలో 17వతేదీన బ్రాహ్మీ ముహూర్తంలో శ్రీ మాతాజీ వారు చేసిన **ప్రబోధమును** సంగ్రహంగా ఇక్కడ ప్రచురిస్తున్నాము - ఎడిటర్)

మనమందరం ఈ ప్రశాంతవాతావరణంలో ఒక దివ్య అనుభూతిని పొందాలని మనకి గురుదేవులు ఈ ఆశ్రయాన్ని ప్రసాదించారు. మనం ఆ ఆశయాన్ని ఎంతవరకు అందుకొన్నాము? 'వారు ఇచ్చిన అనుభూతిని మనం మనస్సులో పొందామా? పొందటానికి అది మనకంటె వేరుగా ఉందా?

మహాత్ములదివ్య సన్నిధి ఎటువంటిది అంటే నిజంగా గురుపాదాన్ని నమ్మితే బాహ్యవిషయాలనుండి మనస్సు విముఖం అవుతుంది, అవికూడ తప్పక వస్తాయి, మనం ఆశ్రయించినా ఆశ్రయించకపోయినా. ఎలా? చిన్నపిల్లవాడికి బెల్లంముక్క, లేదా ఒక చాక్లెట్ ఇచ్చేస్తే వాడే ఉంటాడులే అని పిల్లవాడికి తల్లి తండ్రులు ఎలా చాక్లెట్ ఇస్తారో, అలాగే మనకి ఈ లౌకికావసరాలు తీర్చటంతో పాటు భగవదభూతిని రుచి చూపిస్తున్నారు, ఆ చాక్లెట్ రుచిచూసిన తరువాత వాడు ఆ భగవదనుభూతికి శాశ్వత వారసుడు కావాలి అని. మహాత్ముల సన్నిధికి వెళ్ళినాకు ఇల్లు కావాలనో లేక మా పిల్లకు పెళ్ళి కావాలనో అడిగితే అవి ఇవ్వటానికి వారికి కష్టం ఏమీ ఉండదు. కాని మనం కోరవలసింది ఇదేనా? లేక ఇంకేమైనా జీవితంలో సాధించాల్సినది ఉన్నదా?

మహత్తరమైన దివ్యమైన తత్వాన్ని జుర్రుకోవటం తెలియక మామూలు విషయాదులను గురించి ఆలోచిస్తారు - నన్ను కారులో ఎక్కించుకొన్నారు,నాకు ఇది పెట్టారు అని- అంటే ఇంకా మనం మన భౌతికదేహాన్నే చూసుకొంటున్నాము అన్నమాట.

ప్రపంచానికే నాధుడు అయిన ప్రభువుకు ఇది తృప్తినిస్తుందా? వారు నిన్ను నీవు గుర్తించాలి అని కోరుకుంటారు. సరే మొదట్లోనే అంత పెద్ద విషయం అక్కరలేదు. కాని కనీసం ప్రాపంచిక సుఖాలకంటే ఉత్కృష్టమైన ఆనందం పొందాలి. దానికి అడ్డం వచ్చేది మనస్సు. ఉదాహరణకు కాంతికి అడ్డుగా పలకల గ్లాసు పెడితే దానిమీద సూర్యకిరణాలు పడి అనేక రంగులలో కిరణాలు బయట పడతాయి. మేఘాలమీద సూర్యకాంతి పడితే ఇంద్రధనుస్సు ఏర్పడుతుంది. వీటిలో ఉన్నది ఒకే శక్తి. మనం మహాత్ములకు ఎంతో శక్తి

ఉందని పొగడి తృప్తిపడతాం. కాని వారు"ఆ శక్తి నీలో కూడా ఉందిరా! దానిని గుర్తించు.'' అని ఘోషిస్తున్నారు. భగవంతుడు గొప్పవాడు అంటే వారు ఏమీ ఆనందించరు. ఎందుకంటె దానివల్ల మనకుగాని భగవంతుడికి గాని ఒరిగేది ఏమీ ఉండదు.

నేను గురుదేవులకు నమస్కారం చేసుకొన్న సందర్భాలు చాలా తక్కువ. ధైర్యం చేసి పెట్టుకోబోతే "ఎందుకు తయారయ్యావు?' నీవు చేసేదంతా నమస్కారం కాదా? ప్రతి కదలికా నమస్కారం కాదా?'' అనేవారు. ఒక్క పాదపూజలో మాత్రం నమస్కారం ఇచ్చేవారు. నీ ప్రతి ఉచ్ఛ్వాస, నిశ్శ్వాసములు ధ్యానం కంటే భిన్నం కాదు. ఎవరైనా భక్తుడు వచ్చి 'నేను ధ్యానం చేసుకోలేకపోతున్నాను' అంటే,"సరే! ఇప్పుడు తెలుసుకున్నావు కదా. ఇప్పటినుంచి ధ్యానం చెయ్యి. ధ్యానం నీ దినచర్యలో పెట్టుకో.'' అని చెప్పేవారు. తన బిడ్డలు ఆధ్యాత్మికవీరులుగా ప్రకాశించాలనేదే మహాత్ముల ఆశ. ఒకళ్ళమీద ఒకళ్ళు చాడీలు, పితూరీలు చెప్పుకుంటే శ్రీబాబు చిరాకు పడేవారు.

ఎవరి స్వభావాలు ఎవరు మార్చుకొన్నారు కనుక? కాని మహాత్ముల చెంతకు వచ్చాక అయినా అవన్నీ వారికే వదిలేస్తే ధ్యానం తన్నుకొంటూ వస్తుంది. ధ్యానం మన జీవితంలో పార్ట్ అయి ఉంది. నిద్రలో వచ్చే విశ్రాంతితో ఆనందపడుతున్నావు. నిద్రనుంచి లేచి 'హాయిగా నిద్రపోయాను' అంటున్నావు. నువ్వుఎన్నో కర్మలు చేస్తున్నావు. అవన్నీ వాసనలకు కారణం అవుతున్నాయి. నువ్వు ఏది చేసినా ఇతర చింతన లేక భగవత్పరంగాచేస్తే అప్పుడు అది కర్మయోగంగా మారి నీకు ధ్యానం కుదురుతుంది..

గురుదేవులు "నీ హృదయబాబును నేనే రా' అన్నారు. ఇది సుప్రతిష్ఠమైన మాట. బాబు ఎక్కడ ఉన్నారు? పెద్దఫోటో పెట్టుకుంటేనే ఉన్నారా? పుస్తకాలలో ఉన్నారా? 'వాటిని పట్టించుకోకు. నేను నీ హృదయవాసిని' అన్నారు ఆయన స్పష్టంగా. మరి ఆయనను ఎందుకు తెలుసుకోలేకపోతున్నాము? ప్రపంచంలో అన్ని వస్తువులవైపు పరిగెడతాం. ఆయనవైపు మాత్రం చూడం. ఆరాధన చేసుకొనేవాడు ఎక్కడ ఉన్నాడు? ఆరాధన చేయించుకొనేవాడిలో ఉన్నాడు. ఆరాధన చేయించుకొనేవాడు నీ గుండెలో ఉన్నాడు. నువ్వు ఎక్కడ కూర్చున్నా - లోకంబులు లోకేశులు లోకస్థులు తెగినతుదినల్లోకంబగు పెంజీకటికవ్వల నెవ్వండేకాకృతి వెలుగునో అతనినే సేవింతున్ - అని పోతన అన్నట్లుగా మనం మనసారా తల్చుకుంటే ఆయన దర్శనమీయరా? తిరుపతిలోనిశ్రీవెంకటేశ్వరస్వామిలో మన గురుదేవులను చూడలేమా? నువ్వు బజారుకి వెళ్ళావు. కాని నీ ధ్యాస పిల్లలమీద మళ్ళిందనుకో, నువ్వు సరిగ్గా వస్తువులు తేలేవు.

మరి మనం ఆ ప్రభువునే తలుస్తూ ఎంతవరకు చేస్తున్నాం? ఆ ప్రభువు దయను మనం ఎంతవరకు గుర్తించాం? మనస్సు మూడు పలకల గ్లాసు వంటిది. త్రిగుణాత్మకము. నేనును, మేనును దృష్టిలోకి తెచ్చి ప్రపంచవిషయాలపై పరుగిడుతుంది. మనస్సును భగవంతునిపైకి మరల్చటానికి గురుదేవులు భాగవతాది గ్రంథాలను చదవమని మాటిమాటికి చెప్పేవారు. స్వామి వారు సత్సంగం చేసికోమనేవారు. అంటే ఎంతోమంది ఉంటేనే సత్సంగం కాదు. భగవద్విషయాలను నీలో విచారణ చేయటం కూడా సత్సంగమే. గురుదేవుల వాక్యాలను ధ్యానిస్తే బుద్ధి పరమాత్మునిపై నిలుస్తుంది. మనస్సును సద్విషయంలో ఊరవేయటానికి గురుదేవులు మనకు చక్కని అవకాశం ఇచ్చారు. మనం సినిమా చూడటానికి రాలేదు కదా. మనం సాధకులం. సాధన చేయటానికి వచ్చాం. దేహం సహకరించినప్పుడే మనం ఈ విషయం గుర్తించకపోతే జీవితం పరిసమాప్తమయి, **పునరపి జననం పునరపి మరణం** - జనన మరణ వలయంలో చిక్కుకొంటాము. అందుకే గాంధీ మహాత్ముడు చెప్పినట్లు చెడు చేయకు. చెడు చూడకు, చెడు వినకు. మనం చేస్తున్న సత్సంగానికి న్యాయం చేకూర్చాలంటే ఇక్కడ ఉన్న విషయాన్ని పూర్తిగా అనుభవించాలి. ఏకాంతంగా హాయిగా ధ్యానం చేసికోండి. తక్కువ మాట్లాడండి. దేహానికి ఎంత అవసరమో అంతే ఆహారము, విశ్రాంతి తీసికొండి.

ధ్యానం జీవితంలో ఒక పార్ట్. ధ్యానం లేకుండా మనం లేము.ధ్యానం అంటే ధీ యానం. దానివల్ల ఏకాగ్రత కుదురుతుంది. కారు డ్రైవ్ చేసేవాడికి ఏకాగ్రత లేకపోతే ఏమవుతుంది? అన్నం వండేటప్పుడు చూడకపోతే ఏమవుతుంది? అన్నం చిముడుతుంది లేదా అడుగంటుతుంది.

మనం ఇక్కడకు వచ్చాం అంటే ఏకాగ్రత లేకపోతే ఎలా వచ్చాం? స్నానం చేసి బొట్టు పెట్టుకొని భగవంతుని తలుస్తూ ధ్యానంలో దేహాన్ని కూర్చోబెడుతున్నాం. అది మాత్రమే చాలదు. మనస్సు ఏకాగ్రత చెందాలి. అప్పుడు అనుభూతి వస్తుంది. ఆఅనుభూతి అందరిదీ. కొందరిదే కాదు. ప్రయత్నపూర్వకంగా బాహ్య విషయాలు నిరోధించి మనలో ఉన్న సత్యవస్తువును గుర్తిస్తూ భగవంతుని పరమానుభూతిని మనం ఇక్కడ అనుభవించవచ్చు. అనుభవిస్తున్నాం. అందుకే ఈ విధంగా సత్సంగాలు చేయిస్తూ నిరంతర సాధన చేసే అవకాశాన్ని మన గురుదేవులు మనకు ప్రసాదించారు. ముందర నిన్ను నీవు తెలిసికొవాలి.నీలోనే ఉన్న శక్తిని తెలిసికోవటానికి ప్రయత్నం చెయ్యి. అట్టి శక్తిని భక్తిని సాధనా సంపత్తిని గురుదేవులు మనందరికీ ప్రసాదించెదరుగాక సుఖీభవ! సుఖీభవ!!

# సమర్థ సద్గురు నాధుని దివ్య చరిత్ర

- స్వామి విజయేశ్వరానంద ప్రసాద్

గుంటూరు జిల్లా, నంబూరు గ్రామ సమీపంలో 1972 లో తమ భక్తులు నిర్మించిన శ్రీకాళీవనాశ్రమ (శ్రీ కాళీ గార్డెన్స్) సంస్థాపక సర్వాధ్యక్షులైన శ్రీ బాబూజీ మహరాజ్, 1988 డిసెంబర్ మూడవ తేదీన తమ అవతారం చాలించేవరకు అవిశ్రాంతంగా, తమ ఆశ్రమమును బ్రహ్మచర్యాది చతురాశ్రమముల వారికి చక్కని సాధన కేంద్రంగాను, కుల మత వర్గ భేద భావ రహితమైన ఒక ఆదర్శ ప్రాయమైన ఆచరణాత్మక సమ సమాజ వ్యవస్థగాను, సర్వమత సమ్మతమైన విశ్వమత ప్రబోధక కేంద్రంగాను, ఆధ్యాత్మిక విశ్వ విద్యాలయంగాను తీర్చిదిద్దారు. తమ దర్శన భాగ్యం పొందిన ప్రతి ఒక్కరికి ఆత్మీయులై, అందరి హృదయాలలోను "హృదయబాబు"గా చెరగని ముద్ర వేసుకొని నిలిచిపోయారు.



ప్రేమగా, గోముగా, భక్తులందరు ఆయన్ను "బాబు" అని పిలుచుకుంటారు.

'బాబు' అంటే తండ్రి. 'బాబు' అంటే తనయుడు. 'బాబు' అంటే ప్రభువు. బాబు అంటే ఆత్మీయుడు. అవును! అన్ని పాత్రలను ఆయన ధరించి, అన్ని విధాలుగాను తన భక్తులనందరిని లాలించారు. వారి మొరలాలించారు, పాలించారు. **"యే యధా మాం ప్రపద్యంతే, తాంస్తథైవ భజామ్యహం"** అన్న గీతాచార్యుని అభయ వాక్యమును నిజం చేస్తూ, ఎవరెవరు ఏ యే పేరులతో పిలిచారో, ఏ యే తీరులుగా కొలిచారో, ఏ యే కోరికలతో తలచారో, ఆ యా విధంగా దేశ విదేశాలలోని తమ ఆశ్రితులను శ్రీ బాబు అనుగ్రహించిన, ఇప్పటికీ అనుగ్రహిస్తున్న, సంఘటనలు కోకొల్లలు.

శ్రీబాబు ఎవ్వరి వారు? ఎక్కడి వారు? ఏనాటి వారు? ఈ ప్రశ్నలన్నిటికి జవాబు శ్రీబాబు అందించిన గేయములోనే -

**ఎవరికి, ఎవరని, ఏమని, ఎంతని తెలియగ తరమౌను బాబును?**

**ఏకాలమందుము? ఏదేశమందుము?**
**ఆకాశమునకేది దేశము, కాలము?**

నిజమే ! అఖండ, అభేద, సర్వాత్మ స్వరూపులై ప్రకాశించే మహాత్ములు జాతి, నీతి, కుల, గోత్ర, నామ, రూప, గుణ భేదములకు అతీతులు. కనుకనే శ్రీబాబు మాటి మాటికి,

**"జాతి నీతి, కుల, గోత్రదూరగం**
**నామ, రూప,గుణ దోష వర్జితం**
**దేశ, కాల, విషయాతి వర్తియత్**
**బ్రహ్మ,తత్త్వమసి భావయాత్మని"** అనే శ్లోకాన్ని వినిపిస్తూండేవారు.

... **" వీరుల జన్మంబు నేరుల జన్మంబులెరుగనగునె"** అని మహాభారతంలోని వాక్యము. ఇక్కడ 'వీరులు' అంటే, దేహాత్మభావమును జయించి ఆత్మజ్ఞాన సంపన్నులైన జ్ఞాన వీరులు.

అయినా, శ్రీబాబు తమ యాదృచ్ఛిక ప్రసంగాలలో, తమ ఆవిర్భావాన్ని గురించి తమ మాతృదేవి వెల్లడించిన వివరాలను ప్రస్తావిస్తూ, ఆమె శ్రీ సంతాన వేణుగోపాలస్వామివారిని అనన్య భక్తితో సేవించుకున్నారని, స్వామి ఆమెకు స్వప్నంలో, నాగేంద్రుని పడగనీడలో శయనించి విరాజిల్లుతున్న ఒక ముద్దుబాలుని రూపంలో దర్శనమిచ్చారని, తమగర్భవాసాన జన్మించగలమని చెప్పి అదృశ్యమైనారని,తదనంతరము తాము జన్మించినట్లు చెప్పారు.

శ్రీబాబు భక్తులు కొందరు తాము పొందిన ధ్యానానుభవములను, స్వప్నానుభవములను ఇలా వివరించారు -

1. శ్రీబాబుకు ఆంతరంగిక భక్తులైన నింద్రకొలను డాక్టరుగారు, తాము ధ్యాన సమయములో పొందిన దర్శనం గురించి ఇలా చెప్పారు -

ఒక అరణ్యమార్గంలో ఆటవిక దంపతులు నడచి వెడుతుండగా, దారిలో ఒక వాగు ఒడ్డున ముద్దులు మూటకట్టే బాలుడొకడు కూర్చుని, తన బుల్లి పాదాలను నీటిలో ఊపుతూ ఆడుకుంటున్నాడు. ఆ దంపతులు అక్కడ నిలబడి పోయి ముచ్చటగా చూస్తున్నారు. ఆ బాలుడు వారిని గమనించనట్లుగా అలాగే ఆడుకుంటున్నాడు. "బాబూ! నువ్వెవరు?" అని వాళ్ళు అడిగారు. ఆ బాలుడు చిన్ని చూపుడు వేలితో తనను చూపుకొని "నేను నేనే" అన్నట్లు నవ్వి, మళ్ళీ ఆటలో నిమగ్నుడైనాడు. " మీ అమ్మ పేరేమిటి

బాబూ?'' అని వాళ్ళు అడిగారు. ఆ బాలుడు వేలితో భూమిని చూపించాడు. వాళ్ళు "మరి మీ నాన్న పేరు?''అని అడిగితే ఆకాశం వైపు చూపాడు. " భూమి నా తల్లి, ఆకాశం నా తండ్రి'' అని ఆ పిల్లవాడు చెబుతున్నట్లుగా వాళ్ళకి అనిపించింది. ఆ బాలుణ్ణి వదలిపెట్టలేక వాళ్ళు, అతనికోసం ఎవరైనా వస్తారేమోనని చాలాసేపు కాచుకుని కూర్చున్నారు. కాని ఎవరి జాడా కానరాలేదు. చీకటి పడుతోంది. అడవిలో ఉన్న ఏ క్రూరమృగమైనా, ఒంటరిగా ఉన్న ఆ పసివానికి ఏ కీడు చేస్తుందో అని భయపడి "బాబూ! మాతో వస్తావా?''అని అడిగితే, ఆ పసివాడు ముసిముసి నవ్వులతో లేచి వారి చేతుల్లో ఒదిగిపోయాడు.

అలా వారితో వెళ్ళిన ఆ పసివాడు కొంతకాలం వాళ్ళని మురిపిస్తూ పెరిగాడు. చిన్ని చిన్ని మాటలతో ముద్దు చేశాడు. ఇంట్లో వారేదైనా వస్తువు కోసం వెదుకుతుంటే "అమ్మా! అదిగో, అక్కడ ఉంది'' అని, అది ఉన్న చోటు సరిగా చూపించేవాడు. ఇలా వారిని, చుట్టుపక్కల వాళ్ళను కూడా ఆశ్చర్యపరుస్తూ, " పసివాడు సామాన్యుడు కాడు'' అని అనిపిస్తూ, ఉన్నట్లుండి అదృశ్యమైపోయాడు.

కొంతకాలం తరువాత, మరొకచోట కొందరు ముఠా కూలీలు ఏదో పనిమీద వెడుతుంటే, వారిమధ్య ఒక చురుకైన బాలుడు వారితోబాటు నడుస్తూ కనిపించాడు. "మన ముఠాలోనివాడు కాడే ఇతడు?'' అని అతనిని వాళ్ళు పరకాయించి చూశారు. తాము ఒకసారి పైన చెప్పిన ఆటవిక దంపతులతో ఉండగా అతనిని చూసినట్లు గుర్తించారు. అతణ్ణి అడిగితే ఔనన్నాడు.

వాళ్ళు అతనితో మాట్లాడుతూ వెడుతుంటే, ఒక కాలువ దాటవలసి వచ్చింది. అందరూ కాలవలో దిగి, పిల్లవాణ్ణి చెయ్యి పట్టుకుని కాలువ దాటిస్తున్నారు. అంతలో కాలువ హఠాత్తుగా పెద్ద ఎత్తున పొంగి వరద వచ్చింది. ఎవరికి వారు చెల్లాచెదరై ప్రాణరక్షణ కోసం పరిగెత్తి యీదుకుంటూ ఎలాగో ఒడ్డు చేరారు. అందరూ దాటిపోయాక బాలుని మాట జ్ఞాపకం వచ్చి చూసేసరికి ఆ బాలుడు మునిగిపోతూ కనిపించాడు. అందరూ పరుగున వెనక్కివెళ్ళి అతనిని దాటిద్దామనుకున్నారు. కాని ఎంత వెదికినా అతడు కనపడలేదు. సాహసించి కాలువలో దూకి కొంతమంది ఈదుకుంటూ వెళ్ళి చూశారు. కాని లాభం లేకపోయింది. తమ పనికి వేళ మించిపోతున్నందున, కన్నీటితోనే వారందరు ముందుకు సాగారు.

-సశేషం




(గతసంచిక తరువాయి) -రమణ ప్రసాద్

రాజసూయ యాగం నిర్విఘ్నంగా ముగిసింది... శిశుపాలవధ గురించిన అపవాదు ఉండిపోయింది... అచటకు ఆమంత్రితులైన రాజులు, మహారాజులు, ఋషులు, మునులు, యాచకులు, అతిధులు - అందరూ వారి వారి స్థానాలకు మరలిపోయారు... ఒక పెద్ద తుఫాను వచ్చి వెలిసినట్లైంది. కొన్ని కొన్నింటిలో ఏ మార్పూ లేదు. పూర్వంలాగానే ఉన్నాయి... కాని అశ్వత్థామలో చెలరేగిన తుఫానుకు ఒకగమ్యం అంటూ ఏదీ కనిపించలేదు... ఒకవిధమైన అంతులేని వేదనకు గురిఅయి అతని మనస్సు అతని అదుపులో లేకుండా పోతోంది...

వాయవ్యాస్త్రం, వారుణాస్త్రం, ఆగ్నేయాస్త్రం, నాగాస్త్రం, చివరకు బ్రహ్మాస్త్రం - తన తండ్రి ద్రోణాచార్యుడు ఏ విద్యగాని, ఏ శస్త్రాస్త్రంగాని తన కుమారుడైన అశ్వత్థామకు నేర్పకుండా వదిలిపెట్టలేదు. జమదగ్ని కుమారుడైన పరశురాముని శిష్యుడైన ద్రోణాచార్యుని మించిన ధానుష్కుడు మొత్తం ఆర్యావర్తంలోనే లేడు. అయన తన విలువిద్యను తన పుత్రుడైన అశ్వత్థామకు సంపూర్ణంగా నేర్పాడు. కర్ణుడికి, అర్జునుడికికూడా తెలియని మంత్రశస్త్రాస్త్రాలను పుత్రవ్యామోహంతో అశ్వత్థామకు నేర్పాడు. కాని ఆ రోజున...రాజసూయయాగం జరిగినప్పుడు, సామ్రాట్టులతో, మహావీరులతో నిండిన యుధిష్ఠిరుని పేరోలగంలో, తాను చూసింది... అది సమస్త విద్యలను మించినది.... ఒక్క తృటిలో,సూర్యుని మండుతున్న గోళంలా ఆకాశాన్నించి వచ్చి కృష్ణుని చిటికన వ్రేలుపై నిలిచి తిరగసాగింది... కనులు మిరిమిట్లు గొలిపే ఆ సుదర్శన చక్రం. అది అతని మనస్సు దోచుకుని అతడిని కలవరపెట్టింది... దానిని పొందటానికి అతడు తహతహలాడి పోయాడు.

మరి భీష్మపితామహుడు రాజసూయంలో దేని అండ చూసుకుని కృష్ణుణ్ణి అగ్రపూజకు అధికారిగా చేశాడో?... ఆ రహస్యం ఈ సుదర్శనచక్రంలో లేదుకదా! ఒక్క క్షణంలో... మహావీరులతో నిండిన ఆ సభ కొయ్య బొమ్మవలె

నిశ్చేతనమై జడరూపం పొందింది... మరు క్షణంలో రాజులు, రాజ రాజేంద్రులు కృష్ణునికి జయజయధ్వానాలు చేశారు దాని వెనక ఉన్న కారణం కూడా సుదర్శన చక్ర సామర్థ్య పటిమయే అయి ఉంటుంది... అశ్వత్థామ నమ్మకం ఇంకా దృఢమైంది. ఈ సుదర్శనచక్ర శక్తివల్లనే శ్రీకృష్ణునికి ఆర్యావర్తంలో ప్రథమ పురుషునిగా గుర్తింపు వచ్చింది. దాని శక్తి వల్లనే కృష్ణుడు ఎంతో శక్తివంతుడుగా కనిపిస్తాడు... అశ్వత్థామ దగ్గర ఉన్నంత శస్త్రవిద్య ఎవరి దగ్గర ఉంది? అతనిని మించినవారు ఎవరు? కాని ఈ సుదర్శన చక్రం?... ఇదే కృష్ణునిముందు తనను దిగదుడుపు అనిపించేలా చేస్తోంది...

కృష్ణుని సుదర్శన చక్రం వలె 'నాదగ్గరకూడా సుదర్శన చక్రం ఉంది' అంటున్నవాడు పౌండ్రదేశంలో పౌండ్రకరాజు ఒకడు ఉన్నాడని అశ్వత్థామ వినిఉన్నాడు. అంగదేశానికవతల మోదాగిరి పర్వతం ప్రక్కన ఉంటున్న పౌండ్రకుడు తనకు తాను వాసుదేవుడినని చెప్పుకుంటున్నాడు!... కృష్ణుని వద్ద ఉన్న సుదర్శన చక్రం నా దగ్గరా ఉంది' అంటున్నాడట...కాని కృష్ణుడు వందలమంది ఉన్న నిండు సభలో ... అందరూ చూస్తూఉండగా తన సుదర్శన చక్రం మహిమని, దాని శక్తిని నిరూపించాడుకదా! పౌండ్రకుని సుదర్శనాన్ని ఎవడు చూసివచ్చాడు?.... ఆ కట్టుకథను ఎవరైనా కల్పించి ఉండవచ్చు. ఆర్యావర్తంలో వాసుదేవుడు ఒక్కడే ఉంటాడు!

ఆ వాసుదేవుడు కృష్ణుడే!... అతడే! కాని... కాని...అశ్వత్థామలో ఎన్నో తలపులు అలల్లా లేచి పడిపోతున్నాయి... అవి ఆకాశపుటంచులను దాటి బ్రహ్మాండమంతా వ్యాపించాయి. ఒక్కసారి నేను ఆ సుదర్శన చక్రాన్ని పొందగలిగితే... కృష్ణునివద్దనుంచి ఆ సుదర్శన చక్రాన్ని పొందగలిగితే, తాను వాసుదేవుడవటం అసంభవం కాదు. సృష్టి నడిచేది... ఒక్కసామర్థ్యం వల్లనే! ఇవ్వాళ కృష్ణుడు సమర్థుడు, అందువల్లనే వాసుదేవుడనిపించుకున్నాడు. - రేపు తనకు ఆ సామర్థ్యం వస్తే, ఈ యుధిష్ఠిరుడే తనను అగ్రపూజకు అర్హుడుగా గుర్తించి ప్రథమంగా అర్ఘ్యదానం తనకే ఇస్తాడు - ఈ భీష్మపితామహుడుకూడా తననే స్తుతిస్తాడు. కాని సుదర్శనచక్రాన్ని దక్కించుకోవటం ఎలా?... అది దొరకటం అంత సామాన్యంకాదే... తను ఏ విధంగానూ కృష్ణునికి సరికాలేడు. ఈ విషయం తన కంటే బాగా ఇంకెవరికి తెలుస్తుంది?

కృష్ణుని చిటికన వ్రేలుపై తిరుగుతున్న తేజఃపుంజం శత సహస్రసూర్యుల తీక్షణజ్వాలలను వెదజల్లుతున్న ఆ చక్రాన్ని తన కళ్ళతో

తానే చూశాడు!... ఆ జ్వాలల మధ్య!... స్థిరంగా నించున్న కృష్ణుని, కరుణార్ద్రమైన, నిర్లిప్తమైన మందహాసం... కృష్ణుని ఆ ముఖారవిందాన్ని తను ఎలా మరచిపోగలడు? తనకు అదంతా తెలుసు. తనలో చెలరేగే భావాలూ తెలుసు... కానీ ఆర్యావర్తంలో తాను ఏకమాత్రమైన వాసుదేవునిగా వెలగాలనే తృష్ణ అతనిని పట్టి పీడిస్తోంది... తన ఆకాంక్ష తీరాలంటే ఒకటే ఉపాయం... అది ఆర్యావర్తం నుండి శ్రీ కృష్ణుని నిష్క్రమణ! కృష్ణుడు ఉన్నంతవరకు తన స్వప్నం సాకారం అవటం అసంభవం. పౌండ్రకుని దగ్గరనుంచీ ఏమీ భయంలేదు. కాని కృష్ణుడు! అతని అస్తిత్వం ఉన్నంతవరకు అతడే ప్రథమ పురుషుడుగా గుర్తింపబడతాడు. తను ప్రథమ పూజ్యుడు కావాలనే కలలు కల్లలౌతాయి.

అశ్వత్థామ ఒక నిర్ణయానికి వచ్చాడు. యోచించి యోచించి ఒక పథకం వేశాడు. దాని ప్రకారం తను కృష్ణుని దగ్గరకు వెళితేగాని తన పథకం పారదు. తను కృష్ణుని ఆతిథ్యం పొంది తన పథకం అమలు పరచాలి. ~~ఈ~~ ఆలోచన రాగానే అతను కృష్ణుని వద్దకు ప్రయాణం కట్టాడు!

ఆచార్యపుత్రుడు తన ఇంటికి రాగానే కృష్ణుడు అతనికి అతిథి సత్కారాలు చేశాడు. జరాసంధుడి బారినుండి, యవనునిబారినుండి తప్పించుకోవటానికి, కృష్ణుడు మధురను విడిచి పశ్చిమాన సముద్రతీరాన ఉన్న కుశస్థలికి మారాడు అన్న విషయం అశ్వత్థామ విని ఉన్నాడు. ఆ కుశస్థలిబంగారు కలశాలతో సుశోభిల్లుతున్న భవ్య ప్రాసాదాలతో ద్వారకగా పిలువ బడుతోంది అన్న విషయం మాత్రం అతను ఊహించలేదు... ద్వారక నగర సౌందర్యం చూసి అతడు ఆశ్చర్య చకితుడైనాడు. తాను పూర్వం ఇటువంటి నగరాలు చూసి ఉన్నాడు కాని ఇంత సుఖశాంతులతో విలసిల్లే నగరం ఇంతవరకు చూసి ఉండలేదు... అతని కళ్ళు కృష్ణుని ఇంట్లో ఉన్నతాసనంపైన పెట్టిన సుదర్శన చక్రంమీదనే ఉన్నాయి... అదే సుదర్శన చక్రం... అతని ఆకాంక్షకు కేంద్రం...

- సశేషం

Printed, Published by C.V. Ramana Babu, on behalf of YOGINI SRI CHANDRA KALI PRASADA MATHAJI CHARITABLE TRUST and Printed at Samardha Sadguru Publications, D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh, and published at D.No. 3-499, Sri Kali Gardens Ashram, Nambur - 522508, Guntur Dist., Andhra Pradesh. Editor - Guda Siva Rama Murthy,